# అంకితం

గోవా దాస్యవిముక్తికై
ఆత్మార్పణ చేసిన
అమర మూర్తులకు.



## ఇందులో

# దెయ్యం

మంత్రాల మరిడయ్య వూడిపోతూన్న గోచీ ఎగదోపుకుంటూ పరిగెడుతున్నాడు.

దార్లో పౌరోహితుడు పంకజశాస్త్రుల్లు ఎదురయ్యాడు. "ఏం! మరిడయ్యా అంత హడావిడిగా వెళ్తున్నావ్" అంటూ పలకరించాడు.

"మీకు తెలియదేమిటి మన ప్రశిడెంటుగారికి దెయ్యం పట్టింది"

"దెయ్యమా!"

"ఆఁ! మనవూరికి దాపరించాడుగా శని—"

"ఓహో, అదా— అయితే ఇదేదో కట్నాలు పేచీ అనుకుంటాను"

"అనుకోవట మేమిటి, అంతే; ఈ వాళ పొద్దుట ప్రశిడెంటుగారింటికి వారబ్బాయిని చూచుకోనేందుకు ఎవరో వచ్చారట. అంతా సవ్యంగానే జరిగిందిట. చివరికి ఏదో కట్నాల విషయంలో పేచీ వచ్చిందిట. పదిహేను వేలకి దమ్మిడీ తగ్గదన్నాడట ప్రశిడెంట్ గారు. అంతే అలా అంటూనే ఆయన విరుచుకుబడిపోయాడట – ఇలా కబురంపారు నాకు" అంటూ వొగుర్చుకుంటూ ఏకరువు పెట్టాడు మరిడయ్య.

"నిజంగా దయ్యంకాదు మరిడయ్యా! దేవత— లేకపోతే ఆ సుబ్బయ్యకొడుక్కి కట్నం లేకుండా పెళ్ళిచేసే వాడా? ఈ రంగన్న కూతురికి ఈ జన్మలో పెళ్ళయ్యేదా? పాపం! ఆ తండ్రిలేని పిల్లలకి పెళ్ళయ్యేదా? ఏమంటావ్? ...ఇటువంటి దేవత వూరికొకొక్కటుంటే దేశం బాగు పడేది. కట్న పిశాచం అంతరించేది! ఏమంటావ్!" అంటూ శాస్త్రుర్లు మరిడయ్యకేసి చూసేసరికి మరిడయ్య ఫర్లాంగు దూరంలో వున్నాడు

♦ ♦ ♦ ♦ ♦ ♦

నారాయణకు కోరికలు లేకపోలేదు. జీవితంలో ఎక్కువ తృప్తినిచ్చే దాంపత్యసుఖానుభూతికి దూరంగా వుండాలని యేజీవీ కలలోనైనా ఊహించదు. కానీ, దారిద్ర్యానికి కట్టుబడ్డ నారాయణ కొంత అయిష్టం చూపించాడు. యౌవనంలో అడుగుపెట్టిన నారాయణ, హృదయంలోని తీరనికోరికల రూపాలకు తట్టుకోలేక 'పెళ్ళివద్దు' అని కచ్చితంగా చెప్పలేక పోయాడు.

వద్దన్నా వినిపించుకోకుండా అయిందనిపించేడు ముసలాడు నారాయణకు ఫిరాయింపుపెళ్ళి. నారాయణకు తెలుసు నేటి ప్రపంచంలో తనవిలువ. నలభైరూపాయలు సంపాదించేటప్పటికి తలప్రాణం తోక్కవస్తున్నది. దాంతోటి మూడు ప్రాణులు బ్రతకాలాయె - ఈ కరువురోజుల్లో. మొదటితారీఖు వారం వుందనగానే మొదలు అప్పులు. జీతంవచ్చాక అవితీరిస్తే బండి నడవదు; కనుక అవి అలా పాపం పెరిగినట్లు పెరుగుతూనే

వుంటాయి ఇదీ అతని ఆర్థికపరిస్థితి. ఇక పెళ్ళాడి ఏంసుఖాలను అనుభవించాలి కనుక – పెళ్ళాడగానే సరిపోయిందా ? పిల్లా, పీచూ తయారవుతుంది. అందులో, దరిద్రుడికి సంతాన వేణు గోపాలం. అప్పుడిక నరకం సమీపంలోనే వుంటుంది. వాళ్ళం దరిని పోషించేదెలా, అని నారాయణ ఉద్దేశం.

ముసలాళ్ళివన్నీ చూస్తారూ ! చస్తామని, ఆ ముచ్చట వుండగానే చూసిపోతామని, ముడిపడిందనిపించారు. పోనీ కాస్తోకూస్తో వున్నవాడా అంటే నై నాలుగు రోజులు నారా యణ పడుకుంటే ఆ ఇంటిశోభ భగవంతుడికే తెలియాలి.

గిర్రున సంవత్సరం తిరిగింది నారాయణపెళ్ళయి. నారాయణ గుండెలమీద రాయిపడ్డంత పనయింది. పెళ్లాం ఆడపిల్లను కన్నదనివినగానే – బహుశః తన చెల్లెలి పెళ్ళికి తనుపడ్డపాట్లు జ్ఞాపకం వచ్చివుంటాయి.

"నారోసినవాడు నీరోయడా ?" అన్నాడు ముసలాడు. నేను పోతాను నాకెందుకు అన్నట్టు.

"ఆడపిల్లలుంటే ఇంటికే అందం" అందితల్లి మాట వరసకి. ఎవరేమన్నా కాకిపిల్ల కాకికేముద్దే ! తన తొలినోముల పంటను చూసుకుని మురిసిపోయేది చంద్రిమతి. అప్పుడప్పుడు నారాయణ పిల్లకి గౌనులూ, అవీ కుట్టించి తెచ్చేవాడు.

కాలచక్రానికి విశ్రాంతిలేదు. సంవత్సరాలు దొర్లిపో తున్నాయి. ఎంతో మందిలోకాన్ని విడుస్తున్నారు. అంతకు మరిన్నిరెట్లు అవతరిస్తున్నారు. భవనాలు పూరిగుడిశె లవు

తున్నాయి. శాస్త్రాభివృద్ధి నిరాఘాటంగా సాగుతోంది దాని ఫలితంగా మానవులు దద్దరిల్లుతున్నారు. ప్రళయబాంబులు సృష్టిస్తున్నారు. ప్రపంచం మారింది ధనకాంక్షతో క్రూర మాలతో, ప్రపంచం కుళ్ళిపోతూంది నానాటికి కాలం మారిందిరా అబ్బాయి అన్నారు జుట్టు నెరసినవారు కాలంతో పాటు మనుష్యులుకూడా మారారు. మధ్య తరగతి మనిషి జీవితం అతి దుర్భరంగా తయారయింది. మానవ హృదయాలు మార్దవ రహితమవుతున్నాయి. తన్నుతాను పోషించుకోలేని గతికివచ్చాడు మానవుడు.

నారాయణ జీవితంలో నలభై సంవత్సరాలు ఖర్చయి పోయాయి. తల్లితండ్రులస్థానే నారాయణ కిష్టుడు ఆరుగు రాడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు తొలిచూలుఆడపిల్ల పుట్టిందని వినగానేదిగాలుపడ్డ నారాయణ హృదయం బహుశః బండ బారివుంటుంది. సంతానం పెరిగిందికాని, సంపాదన పెరగ లేదు జీతం పెంచమంటే వీల్లేదంటాడు షావుకారు వున్నగోడు కాస్త చెడగొట్టుకోకుండా సంసారాని వీధిలోకి తీసుకురాకుండా గుట్టుగాసంసారభారంతో నారాయణ సతమతమవుతున్నాడు.

ప్రకృతికాంతకు స్వజాతిపై పక్షపాతం ఎక్కువేమో! తల్లి పేరుపెట్టిన పెద్దపిల్లతాయారు తరువాత ఏడాది తేడగా పుట్టిన శకుంతల పెద్దదానితరువాత నాలుగునెల్లకే పెద్దదయి కూర్చుంది నానా అవస్థలుపడి పెద్దదాని తతంగం అయిందని పించాడు. నాలుగు నెలలకే మళ్ళా—

గుండె ఆగిపోయినంత పనయింది నారాయణకు షావుకారువద్ద పద్దులురాస్తూండగా వచ్చి చెప్పేడు చిట్టోడు నోరు తెరచి గుడ్లు తేలేసి బొమ్మలాగ వుండిపోయాడు. షావుకారు కొడుకు సుబ్బులు "నారాయణా!" అని కేక వేసేటప్పటికి నీరుకమ్మిన గుడ్లతో వెర్రిగాచూస్తూ తడారిపోయిన కంఠంతో "వస్తున్నానండీ" అన్నాడు. బహుశః ఎవరికీ వినిపించివుండదు. ఎంతపాషాణ హృదయుడయినా, ఆనాటి నారాయణ పరిస్థితి చూస్తే హృదయంలో కొంచెం అయినా దయదలచకపోయి వుండడు. చిట్టోడు తండ్రివంకచూస్తూ బిక్క మొఖం వేసుకొని కూర్చున్నాడు. కొట్లో సరుకులకు వచ్చినవాళ్ళంతా మూగజీవాల్లా వుండిపోయారు. సుబ్బులికానాడు నారాయణ మీద ఏనాడు లేని దయ పుట్టుకొచ్చింది. నారాయణను పక్కగా తీసికెళ్ళి ఇరవై రూపాయలిచ్చి "అవసరం తీర్చుకో" అన్నాడు నారాయణ అలాసందేహంగానే వుండిపోయాడు. "జీతంలో తీసుకోనులే నారాయణా" అని సుబ్బులనగానే నారాయణ కళ్ళు ఆనందంతో మెరిసాయి. ఎన్నడూ లేనిదయ ఈనాడు కలిగినందుకు కారణం భగవంతుడిదయో, తన కూతురి అదృష్టమో, అనుకున్నాడు. అవును మరి ఈ ఆచార వ్యవహారాలకు దాసుడు కాకపోతే, భగవంతుడికి, అదృష్టానికి మోసం వస్తుంది.

షావుకారు సుబ్బులు పుణ్యమాఅని ఆచారప్రకారం జరగవలసింది జరిపేడు నారాయణ బావనీ, చెల్లెల్నీ తీసుకొ

చ్చాడు. ఊళ్ళో ఎరుగున్న నలుగురికీ ఇంత అన్నం పెట్టాడా రోజున.

"కన్నెపడుచులున్న ఇంట్లోకి లక్ష్మిరానోరుతుంది" అన్నారు పెద్దలనేవాళ్లు.

"ఇహ అల్లుళ్ళను వెదకాలి" అన్నారు పరిహాసపూర్వకంగా నడివయస్సువాళ్ళు.

నాలుగురోజుల తర్వాత బావని సాగనంపుతూ "పెద్దది మిాకోడలే" అన్నాడు నారాయణ.

నరసింహం నవ్వి వూరుకున్నాడు కాదులే అన్నట్టు. "మాట్లాడవేమమ్మా వ:నం చిన్నప్పుడుకూడా అనుకొనే వాళ్ళం" అని చంద్రమతి అడబడచునుకదలేసింది. మాటల ధోరణిలో, "మాకు కలిగిందేదో ముట్టచెప్పక పోం" అనే సింది. ముట్టచెప్పటం అనగానే నారాయణ హృదయం దడ దడ లాడింది.

చూస్తూండగానే నాలుగేళ్లు దొర్లిపోయాయి. తాయారు కిప్పుడు పదెనిమిదేళ్ళు. తెల్లవారిలేస్తే "ఇంకా ఎప్పుడమ్మా బూరెముక్కలు" అని అనసి వారిది పాపం. చంద్రమతి ఏదో చెప్పి తప్పించుకొనేది.

బాల్యస్నేహితుడు గంగాధరం దగ్గర్నుంచి ముఖపరిచయమున్న ప్రతివాడూ "అల్లుళ్ళను వెతుకుతున్నారా?" "కట్నాలే మాత్రం పోసుచేశారు" అని అడిగేవాళ్ళు. కట్నాలనగానే నారాయణ ఒజారెత్తిపోయేవాడు, అందుచేత

చాలాసార్లు బావకి కబురంపాడు, ఆయన దగ్గర్నుంచి సమాధానం మాత్రం వూడిపడలేదు.

రాత్రి పదింటిదాకా కొట్లో పనిచేసి, పదింటికి కొట్టు మూసి, పగలు షావుకారు కొన్న కాయగూరలు వగైరాలు ఆయన నింటికి మోసుకు వెళ్ళి, అక్కడనుంచి ఇంటికివెళ్ళేవాడు. నాలుగు చెంబులు దిమ్మరించుకొని, పట్టెడన్నంతిని వెన్నెట్లో నులకమంచంమీద మేను వాల్చి విశ్రాంతి తీసుకొంటూ వుంటే, అతనికి యౌవనంలోని మధురాతి మధురమయిన రోజులు జ్ఞాపికివచ్చేవి. వున్నంతలో బ్రతికేవాడు, వేరే చింత లేకుండా. ఇప్పుడో – గంపెడంత సంసారం అదే రాబడి ఖర్చెక్కువ. ఇప్పుడు తాను చేయవలసింది చాలా వుంది — ఆరుగు రాడపిల్లలు...... అప్పుడే యిద్దరు పెద్దవాళ్ళయి కూర్చున్నారు. ప్రస్తుతంలో ఒక్కర్తె పెళ్ళయినా చెయ్యక పోతే కాకిమూక గోల భరించరానిదిగా తయారయింది. తనకూతురికి ఇష్టంవచ్చినప్పుడు పెళ్ళిచేస్తాడు. అసలు చెయ్యడు– అయినా ఏళ్ళదరకీ ఎందుకు ? అనుకొన్నాడు నారాయణ కట్టుబాట్లు బుర్ఖా వేసుకొన్న సంఘం బాధ భరించరానిదై పోయింది. ఎద్దు పుండు కాకేం నెప్పి? బావగారి వూరు వెళ్ళి తాడో పేడో తేల్చుకువద్దామని నిశ్చయించుకున్నాడు

షావుకార్ని బ్రతిమలాడి రెండు రోజులు సెలవుతీసుకొని బావదగ్గరకు బయలుదేరాడు. ఎప్పుడూ రాని వా

డొచ్చాడని నరసింహం చాలా గౌరవంగానే చూశాడు. ఆ రాత్రి భోజనాలయ్యాక పెళ్ళిమాటకదిపాడు నారాయణ.

"మీ కెరుగని దేమున్నది—ఏమంటారు" అన్నాడు.

"మా శంకరాని కప్పుడే పెళ్ళేమిటోయ్, ఎవరేనా వింటే నవ్విపోతారు" అన్నాడు నరసింహం మీ అమ్మాయిని చేసుకోము అని చెప్పలేక.

"మీ అబ్బాయి మీ కెప్పుడూ చిన్నవాడే. నాలు గేళ్ళయింది పెద్దది పెద్దదయి...ఎవరుచూసినా పెళ్ళెప్పుడనే వాళ్ళే, అందుచేతే త్వరలో చేద్దామని ఇలావచ్చాను" అన్నాడు.

నరసింహం బెల్లంకొట్టిన రాయిలా నీళ్ళుకారి అలానే వుండిపోయాడు.

ఇంతసేపటినుంచి తలుపువెనుకనుంచి చెవులు ఇటు పారేసి వింటూన్న నరసింహం ఇల్లాలు మొగుడు మాట్లాడక పోవటంచూచి "మీ అమ్మాయిని చేసుకోవటం నువ్విచ్చే కట్నంపై ఆధారపడి వుంటుంది" అన్నది సగౌరవంగా, ముసుగులో గుద్దులాటెందుకని అన్నగారితో.

నారాయణ హృదయంనించి మెయిల్ కెనడియన్ ఇంజన్‌తో పరిగెత్తింది. నరసింహం పెళ్ళాంమాటదాటి నడిచేంత తెలివితక్కువ దద్దమ్మకాదు. నారాయణ ఆశ, నిరాశచేసుకొన్నాడా. 'కష్టేఫలీ' అన్న పెద్దలసుద్దులు జ్ఞాపకానికివచ్చి "మా పరిస్థితి మీకు తెలియంది కాదుగదాఅమ్మా, ఆప్త బంధువులు మీరే కట్నాలు కావాలంటే ఇతరులడగటానికి

వచ్చిందా? నేనేమీ కట్నం ఇవ్వలేను పెళ్ళికివచ్చినవాళ్ళ కింత పప్పూ అన్నము పెట్టగలను" అన్నాడు దీనాతిదీనంగా

"అయ్యో! సంబడమూ! ఇంతాపిల్లని చేసుకోమనివచ్చి ఇదా చెప్పేది. మంచిమాటే - అంత గతిలేనివాళ్ళ మను కున్నావా యేం! బంధువులయితేనుట్టుకు అంతతేరగా చేసు కుంటారా? నెయ్యిన్నూట పదహార్లు ఇస్తామనివస్తే కాద న్నారు యీాయన. రెండువేలయితే ఏమో అనుకోవచ్చు ఆడబడుచు లాంఛనాలూ, అత్తగారికట్నం, వెండి చెంబూ, వెండిపళ్ళెం కాకుండాను" అందా గృహిణి దీర్ఘాలుతీస్తూ చేతులు తిప్పుకొంటూ.

"అమ్మా! రెండు పూటలా తినటానికే సరిపోని జీతంతో, కట్నా లెక్కడనుంచి తెచ్చేది? నేను అన్న గార్నని సీకుండాలిగాని; కట్నాలుకావాలి, లాంఛనాలు కావాలి అంటే మనప్రేమ, బంధుత్వం కేవలం డబ్బుకోసం నశించిపోవలసిందేనా? బావకూడా మాట్లాడంలేదు నువ్వు సరేఅంటే ఆయన కాదనలేడు" అని చెప్పిచూశాడు నారా యణ. ప్రయోజనం కనపడలేదు నిష్కర్షగా చెప్పివేసింది వీలులేదని ఆ మహా ఇల్లాలు.

కొడుకు పెళ్ళింటో తనకేమీ సంబంధంలేనట్టు నరిసిం హం కిమున్నాస్తిగా వూరుకున్నాడు. "అతనుమాత్రం పెళ్ళాం మాట కాదంటాడా" అని నారాయణ ఆశలు ఆరిపోగా ఆ రాత్రే బరువెక్కిన హృదయంతోను, నీరుకమ్మిన గుడ్ల తోను బయలుదేరాడు.

"ఇప్పుడెక్కడికి వెళతావు! అప్పుడే అర్ధరాత్రి అవ్వొచ్చింది. రేపు పొద్దున్నే బయలుదేరవచ్చు" అన్నాడు నరసింహం మాటవరసకి, ఆమాత్రంకూడా అనకపోతే బాగుండదని. "అక్కరకు రానిచుట్టము..." అని తను చిన్నప్పుడు చదివినపద్యం జ్ఞాపకానికివచ్చి నారాయణ బయలుదేరి కదిలిపోయాడు అక్కడనుంచి.

మేనరికం మాట తీరిపోయింది నారాయణకు. ఎరుగున్న వాళ్ళందరితోను చెప్పాడు, ఎక్కడయినా సంబంధం చూడమని. "మేనరిక మున్నదన్నారుగా ?" "అయినా - కట్నం ఏమాత్రం ?" ఇలా అడిగేవారు. కట్నం ఏమాత్రం అనగానే నారాయణకంఠంలో తడి ఆరిపోయేది. ఏదో చెబుదామనుకున్నప్పటికీ నోటిలోంచి మాట వూడిపడేది కాదు

మేనరికం అలా మండిపోయింది. ఎవరి నడిగినా కట్నాలు- కట్నాలు - ఏమాత్రం - అనేవారే కాని మరో ప్రశ్న లేదు. ఇంకేముంది? నారాయణకు భవిష్యత్తు చీకటిమయమయిపోయింది.

"భగవంతుడా! దయామయుడన్నారే నిన్ను. ఆర్తరక్షకుడవటకూడా. ఇది న్యాయమా స్వామీ. నేనేం పాపం చేశానని నాకారుగు రాడపిల్లల నిచ్చేవు." అని విలపించేవాడు. చివరికి మనోవ్యథతో కృంగి కృశించి పోతున్నాడు నారాయణ

దయామయుడైన భగవంతుడు నారాయణ దీనాలాపాలు విన్నాడేమో మరి—ఒకరోజున నారాయణ బాల్యస్నే

హితుడు సుబ్బయ్య చెప్పాడు "వెంకటరెడ్డిగారబ్బాయి పెళ్ళి చేసుకున్నాడని." వెంకటరెడ్డి నిజానికి ధర్మరాజులాటివాడు, వెళ్ళి చూడు అన్నాడు నారాయణతో షావుకారు.

నారాయణ పొగెత్తాడు. ఈ సంబంధం కుదిరితే తిరుపతి కొండకు వెళ్తానన్నాడు, సత్యనారాయణ వ్రతంచేస్తానన్నాడు. ఇలా అనేకం అనుకుంటూ వెళ్ళాడు నారాయణ.

ఎంతో మర్యాదగా ఆహ్వానించేడు వెంకటరెడ్డి. నిజానికి వెంకటరెడ్డి ధర్మరాజులాంటివాడే అయితే, చుట్టూవున్నవి దుష్టగ్రహాలు. మాసినగడ్డం, మాసికలతో నిండిన గుడ్డలతో వున్న నారాయణను చూచి వెంకటరెడ్డి అసహ్యించుకో లేదు సరికదా జాలిపడి వచ్చిన పనేమిటని అడిగాడు.

"మీ..." అని మింగేశాడు. నారాయణ.

"మీ అబ్బాయి–" అని మళ్ళీ గొణిగాడు.

"చల్లకువచ్చి ముంత దాచటమెందుకు చెప్పండి" అన్నాడు రెడ్డి.

"మీ అబ్బాయికి మా అమ్మాయిని..."

"అలాగేచూద్దాం." అనేశాడు వెంకటరెడ్డిఆలోచించకుండానే.

నారాయణ హృదయంలో ఆశాంకురం నాటుకొంది. కాని ఎంతో సేపు పట్టలేదు—అది నశించేందుకు.

"పిల్లవాడికేదయినా ఉద్యోగం ఇప్పించి చేసుకోండి" అన్నాడు రెడ్డి.

ఏడిసినట్టేవుంది! ఉద్యోగం ఇచ్చేస్థితిలో వుంటే తనకీ గతేంకాలె కర్మం! అలాగే! చూస్తానులెండి మళ్ళీ కలుసు

కుంటూగా!" అని లేచి గుమ్మందాకా వెళ్ళి మళ్ళీ ఏదో జ్ఞాపకంవచ్చి వెనక్కి తిరిగి "అన్నట్లు అబ్బాయి ఏం చదువుకున్నా డన్నారూ–"

"ఆఁ! ఎంతో నా తరుపుఫారం ఫేలయిపోయారుకున్నాడు" వెంటనే, మళ్ళీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు నారాయణ. తర్డుఫారం ఫేలయినవాడికి ఉద్యోగమేమిటి... అయినా, నేనా ఇప్పించేది! చాల బాగుంది, బి. ఏలు. ఎమ్. ఏలు ప్యాసయి ఉద్యోగాలు లేక ఏడుస్తున్న వాళ్ళు ఏడుస్తుండగా వీడికిఉద్యోగం ఏమిటి?" అనుకున్నాడు నారాయణ

ఒకాయన బి ఎ.బి.ఎల్. పాసయి ప్లీడరీ పెట్టుకోనేందుకు డబ్బులేక ఒకవేళ పెట్టుకున్నా నాలుగయిదేళ్ళదాకా సూట్ల ఇస్త్రీకన్నా డబ్బులురావని, టైపిస్టుగా జేరి నెలకు అరువై రూపాయలు సంపాదిస్తున్నాడని చెప్పిన షావుకారు మాటలు జ్ఞాపకానికివచ్చి, నారాయణ ఆశ పటాపంచలై పోయింది.

నారాయణ జరిగినదంతా షావుకారుతో చెప్పాడు. షావుకారు కాసేపాలోచించి "నేను స్కూలుఫైనల్ చదువుకొనేటప్పటి స్నేహితుడొకడు, ఇప్పుడు ఈ వూరి పోస్టుమేస్టరుగా వచ్చాడు. చెప్పిచూస్తాను, ఏ పోస్టుమేన్ ఉద్యోగం అయినా ఇప్పిస్తాడు; ఆపైన నీ అదృష్టం" అనేసి వూరుకున్నాడు.

ఆ మరునాడు శెట్టి రామారావుని తీసుకొని తన పాత స్నేహితునిదగరకు వెళ్ళి అంతా వివరించి ఎలాగయినా ఏదో

వొక ఉద్యోగం ఇప్పించాలని పాధేయపడ్డాడు. పోస్టుమాస్టర్ తన స్నేహితుని రికమండేషన్ వల్లనయితేనేం. పోస్టుమేన్ అవసరముండయితేనేం; రామారావుని ఆ తక్షణం పోస్టుమేన్‌గా, ఆ వూళ్లోనే వేసినట్లు ఆర్డర్స్ తెప్పించాడు

"నారాయణా! ఈనాళ ఆ పోస్టుమేస్టర్ వద్ద పాధేయపడినట్టుగా నా జన్మలోనే నెవరిదగ్గరా అలా పాధేయ పడలేదు. నిన్ను చూసి అలా చేయవలసివచ్చింది. చెప్పినందుకు కాదనకుండా పనిఇచ్చేడు పుంబివాడు" అన్నాడు షావుకారు నారాయణతో.

భగవంతుడు ఈనాటి కయినా దయచూపించేడు అనుకొని నారాయణ కులాసాగా ఆరోజు గడిపేడు. పోస్టల్ వాళ్ళ పుణ్యమా అని బి. ఎ. కన్నా ఎక్కువగా సంపాదిస్తున్నాడు రామారావు. నారాయణ 'అమ్మయ్య' అనుకున్నాడు. ఇక పెళ్ళే తరువాయి.

కాని విధి బలీయమయినది. పెళ్ళికొడుకు, వెంకటరెడ్డి అంగీకరించారు. కాని, ఆడ శిఖండీలు పడనివ్వలేదు. "సిక్షే పంలా నెలకి 60 రు. తెచ్చుకుంటున్నాడు. ఇంకే సంబధమయినా అయితే షుమారు రెండు వేలకి తక్కువ రాదుకదా! పైగా అమ్మాయి పెళ్ళిచేయాలి. ఎదిగి కూర్చుంది. దానికి కట్నం ఎక్కడనుంచి తెస్తారు. దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి. ఇప్పుడు కాకపోతే మరెప్పుడు వెనక వేస్తారు నాలుగురాళ్లు." అంటూ దీర్ఘాలుతీస్తూ రెడ్డిభార్య అనేటప్పటికి రెడ్డికాని, రామారావుకాని కాదనలేక పోయారు.

నారాయణ హతాశుడై వెళ్ళిపోయాడు. కొంచెం కొంచెంగా పిచ్చివాడయ్యేడు మాసినగడ్డం, చిరిగి మసి గుడ్డలైనబట్టలు, తనలోనే తాను మాట్లాడుకోవటం ఇవన్నీ చూచి నారాయణకు పిచ్చెక్కుతుందనుకున్నారు ఎరుగున్న వాళ్ళంతా.

"ఎంతపని చేశాడు ఘుండాకోరు" అని శెట్టి పళ్లు కొరికాడు. "ఇంత ఘోరమా! ఇంత అన్యాయమా!" అని ప్రజలు ముక్కుమీద వేళ్లేసుకున్నారు. ఎవరేమంటే ఏం లాభం, అందరిలాగే ఈ సమయంలో నారాయణకు దేవుడనేవాడు నిజంగా వున్నాడా ? అనే సందేహంవచ్చింది.

పదిరోజుల తర్వాత తెలిసింది, ఎవరో రెండువేల ఐదు వందలకు మాట్లాడుకొని, ఐదువందలు బజానా యిచ్చివెళ్ళారని ఆ తరువాత నెల్లాళ్ళకు రామారావు పెళ్ళయింది. ఊరేగింపు నారాయణ గుమ్మం ముందుగానే వెళ్ళింది. నారాయణ గుమ్మంముందు రామారావు పెళ్ళికూతురులా తల వంచుకున్నాడు. (?) ఎవరూ అది గమనించనేలేదు. నారాయణహృదయం చేత్తో కెలికినట్టయింది. విచారించి లాభం లేదని యిప్పటికి కతని కర్థమయింది.

నారాయణ వరాన్వేషణ మానలేదు— ఎలా మానగలడు ? ఎలాగో తెలిసింది తాపీ సుబ్బారాయుడి కొడుకు పెళ్ళి యీడువాడని. నారాయణకి తెలుసు సుబ్బారెడ్డి కుటుంబం సంగతి. సుబ్బారెడ్డి అరవయ్యో పడిలోవాడు.

కొడుకు పెళ్ళికి వున్నాడు. అతనికి తాపీపనుంటే రెండు రూపాయిలొస్తాయి, లేకపోతే మూడంకె వేసి పడుకోవలసిందే. అయినా నారాయణకి వెలితి కనపడలేదు. అల్లుడు తాపీవాడని కించపడలేదు. కట్నాల ప్రశక్తి రాదని గట్టిగా నమ్మేడు. ఆ సాయంత్రం నాలుగు గంటలవేళ "ఎప్పుడు తిరుగుతూవుంటే కొట్లో చూసే దేవరు" అంటూన్న షావుకారుని బ్రతిమాలుకొని సుబ్బారాయుడింటికి బయలు దేరాడు. వెళ్ళివెళ్ళడంతోనే ముసుగులో గుద్దులాటెందుకని "మా పెద్దమ్మాయిని, మీ అబ్బాయికిస్తే బాగుంటుంది. మన యిద్దరం ఒకలాగే వున్నాం. ఆ యిద్దరికి జోడుకూడా బాగుంది" అన్నాడు.

సుబ్బారాయుడు సంతోషించాడు. కాని వూఁ ఆఁ అని నశిగాడు.

"నీ ఉద్దేశం ఏమిటో సరిగా చెప్పు" అని నారాయణ తేగేసి అడిగాడు.

"అఁ ! ఏమీ లేదు. చింతలపూడిదగ్గర ఏదో పల్లెటూరట మొన్న వాళ్ళొచ్చారు. పిల్ల ఎర్రగా చక్కగావుంటుంది. వాళ్ళు రు. 250 కట్నం యిస్తామన్నారు. వాళ్ళకే మాట చెప్పనేలేదు. మరి నీ మాటేమిటి చెప్పు" అన్నాడు ముసలాడు ఆశగా—

ఆ మాట వినేటప్పటికి నారాయణకు కాళ్ళ క్రింద భూమి కదలిపోయినట్టయింది. నారాయణ ముఖం కందగడ్డలా

తయారయింది. కళ్ళు చింతనిప్పల్లా మెరుస్తున్నాయి తనెక్కడ వున్నాడో తనకే తెలియదు. వళ్లు తెలియని ఆవేశంతో సుబ్బారాయుడి కంఠం రెండు చేతులతో పట్టుకొని "దౌర్భాగ్యుడా! నీకూ కట్నం కావాలీ! కూలివాడికి, ఏరోజు కూలి తెస్తే ఆ రోజు తిండి వుండేవాడికినీకూ కట్నం కావాలేం!" అని కంఠం గట్టిగా నొక్కేశాడు. ముసలాడి గోలకు ఇరుగు పొరుగువారంతా పరుగెత్తుకొచ్చారు. నలుగురైదుగురు వచ్చి నారాయణని పట్టుకొనేదాకా నారాయణకి తా నేమి చేసిందీ తెలియనేలేదు. ముసలాడికి కాసిన్ని చన్నీళ్లు పట్టబోయారు, అప్పటికే అతని ప్రాణాలు గాలిలో కలిసి చాలా సేపయింది.

ఆ మరునాడు పత్రికలో పడింది "నారాయణ అనే వ్యక్తి తన కూతురుని చేసుకోమని అడిగితే కట్నం యిమ్మన్నాడని, సుబ్బారాయుడు అనే అతన్ని కంఠం పిసికి చంపాడు" అని.

మరి నాలుగు నెలల తరువాత, తిరిగి పత్రికలో ఇలా వ్రాశారు. "కట్నం యిమ్మన్నందుకుగాను గొంతుకు పిసికి చంపిన నేరానికి నారాయణ అనే వ్యక్తికి ఉరిశిక్ష విధించబడింది."

ఆ తరువాత నారాయణ దెయ్యం అయినాడని, వెంకటరెడ్డి కుటుంబాన్ని హింసిస్తున్నాడని, కట్నా లడిగే వాళ్ళందరికీ కనపడి భయపెడుతున్నాడని ఆ వూరి ప్రజలంతా అనుకుంటారు..

(3)

# ఎక్కిళ్ళు

అది మే నెల. అంటే వేసవి సెలవలన్నమాట. మా నాన్న గవర్నమెంటు ఉద్యోగం పుణ్యమా అని నా కెక్కడా పదాడిదికి ఎక్కువ స్థిరనివాసయోగం పట్టలేదు. అందుచేతనే నే చెప్పుకోతగ్గ స్నేహితులను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. సాహిత్యం అంటే చిన్నప్పటినుంచీ చెవికోసుకోవటంవలన, స్పోర్ట్స్‌మన్ స్పిరిట్ వడ్లగింజలో అరవైయో వంతయినా నాలో ఆవిర్భవించలేదు. అందుచేతనే చాలమందిని పరిచయం చేసికొన వలసిన అగత్యంకూడా కనపడలేదు.

పూర్వం ఆ ఊళ్ళో నేను ఫస్ట్‌ఫారం చదివాను. అప్పుడు నాకు సుహాసిష్టువనే స్నేహితు ఉండేవాడు. పోనీ, వాడయినా కనిపిస్తాడేమోనని ఒక రోజున చల్లగాలికి బయలుదేరాను. బయలుదేరటం అంటే బయలుదేరాను కాని ఎక్కడ కనిపిస్తాడని వెతకటం? ఏమిటోచక, ఇన్ని కాఫీనీళ్ళు పొట్టలో పోసుకుంటే మంచిదనిపించింది. వెంటనే కనిపిస్తున్న వసంత మహాల్లోకి వెళ్ళాను. సర్వర్ కాఫీ తెచ్చాడు. తాగుతున్నాను. ఇంతలో నా వెనకనుంచి "ఏయ్! ఇది కాఫీయా పానకమా? ఇంతతక్కువ వేశావేం పంచదార? కాసిన్ని పాలూ, డికాషన్ తీసుకురా" అన్నమాటలు నాకు చిరపరిచితమయినవిగా వినపడ్డాయి. నా ప్రయత్నం లేకుండానే నా తలటువైపు తిరిగిందని వేరే చెప్పాలా!

చూద్దునుకదా! ఇంకెవరూ! మా మణ్యంగాడు. మణ్యం నేనూ ఇంటర్ చదువుకొనేరోజుల్లో రూమ్‌మేట్సుము. నే వెనక్కుతిరగటం వాడు నావైపు చూడటం ఒక్కసారే జరిగాయో ఏమోమరి, వాడు "ఏరోయ్! ఇక్కడ ప్రత్యక్ష మయ్యావేమిటి? మీ ఫాదరుకుకాని, ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ అయిందా ఏమిటి? అయితే బ్రతికానన్నమాటే. ఎవడూ తెలిసినమొఖంలేక చస్తున్నాను. ఆ మేట్నీలన్నా రోజూ వేయకుండా వున్నారు. అయితే, ఇంతకీ ప్రస్తుతం ఏంచేస్తున్నట్లు? వగైరా లేమయినా అయ్యాయా?" అంటూ వాడో ప్రశ్నల అస్త్రం వదిలాడు.

వాడి ప్రశ్నలకు జవాబులు చెప్పుకొని, సాయంత్రం రద్దీవేళ ఒక్కొక్కళ్లు గంటలేసి సేపు కూర్చుంటే ఎలా అనుకుంటున్నట్లుగా ఉన్న కేషియర్‌కి బిల్లు చెల్లించుకొని బయట పడేసరికి "గుంటూరు ఆట్రగడ ధాన్యం, ఇరవై నాలుగు కుంచాల బస్తా, సంచితోసహా"........అన్న మాటలు వినబడుతున్నాయి పార్కునుంచి.

నెమ్మదిగా పిచ్చాపాటి మాట్లాడుకొంటూ పార్కు చేరాం. పార్కులో ఓమూల, సిమెంటుబల్లమీద కూలబడ్డాం చుట్టూ అందరిని పరికించి చూస్తూ. ఇంకా రేడియోలో 'కాంబోడియాపత్తి"... అంటూనే ఉన్నాడు

"నీకిక్కడెట్లా కాలక్షేపం అవుతున్నాదిరా? అవును కాని, నీకిక్కడెవరున్నారు చుట్టాలు" అన్నాను.

"మా అత్తారిదీ ఊరే"

అదృష్టవంతుడు అని మనస్సులో అనుకొంటూ ఉంటే "ఏం అదృష్టంలేరా అబ్బీ" అని ఎవరో నాలో చెప్పుతున్నట్లుగా ఉంటే "అలాగా" అన్నాను వాడితో......

"ఇంకా ఎన్నాళ్ళుంటావేమిటి?"

"ఏదీ, నిన్నే గావస్తా, ఓ పదిరోజులయినా ఉండాలంటావా!"

"అప్పుడు చెప్తుండేవాడివి, ఆ మేనరికం సమంధమేనా?"

"కాదు, వాళ్ళకూ, మాకూ కట్నాలలో తేడావచ్చి మానేశాం. మేనరికం అంటే జ్ఞాపకంవచ్చింది, ఈమధ్య ఇంకో మేనమామ గారింటికి వెళ్ళానులే; అక్కడ ఇరవై యేళ్లొచ్చి, పెళ్ళయినా, నాకు తెలియని చిన్నవిషయం తెలుసుకున్నాను. వింటానంటే సంగ్రహంగా చెబుతాను."

"ఉన్నది ఉన్నట్టుగా నేచప్పు. సంగ్రహం ఏఖర్మరా" అన్నాను.

ఆవగింజంత దాన్ని ఆకాశమంత చేసి చెప్పటం అనవాయతే మావాడికి. వాడు 'చిన్న సంఘటన' అంటే అదసలు లెక్కచేయవలసిందిగా అక్కినవాళ్ళకు ఉండనే ఉండదు. అయినా అందులో ఏదో నగ్న సత్యం మాత్రం ఉంటుందనటాని కేంతమాత్రం సందేహంలేదు. మేం చదువుకొనే రోజులనుంచీ, వాడు చెప్పే ప్రతిమాటా ఎక్కువ ఆత్రుతతో కాకుండా, ఎక్కువ పరాకుగా కాకుండా, మధ్యరకమయిన కుతూహలంతో వినటం నాకు పరిపాటయింది.

మావాడు ప్రారంభించాడు. వాడి మాటల్లోనే చెబితే బాగుంటుంది

నేను మామయ్యను చూసి చాలకాలం అవటంవలన ఒక శుభముహూర్తాన బయలుదేరాను. స్టేషనుకు వెళ్ళే సరికి, మెయిల్ ఆరుగంటలలేటుతోనూ, క్లైవ్‌భాషలో నైన్ డవున్ అనబడే బండి అయిదున్నరగంటల లేటుతోనూ, రావచ్చునని స్టేషనుమాస్టరు చల్లగా చెప్పాడు. క్లైవ్‌వాళ్ళని తిట్టుకొంటూ కారు స్టాండ్‌కి వెళ్ళాను. "ఇప్పుడంటే ఇప్పుడే వెళ్ళిపోయిందండి ఓకారు, మళ్ళీ ఓగంటలో ఇంకొకటి బయలు దేరుతుంది" అన్నాడు ఓబ్రోకరు మహాశయుడు గుర్రబ్బళ్ళలో ప్రయాణంకాదుకనుక, విమానంమీద వెళ్ళేభాగ్యంసామాన్య భారతీయులకింకా పట్టలేదు కనుక, గంటతర్వాత బయలుదేర నున్నకారులో సామాను పెట్టించి అందులోనే కూలబడ్డాను.

"కలియుగే ప్రథమపాదే" అనటం మానివేసి కలియుగే ద్వితీయపాదే' అని పురోహితులు ఎన్నాళ్ళకు అంటారో కాని, నాకా కారులో ఉన్న గంటన్నరలోనూ ఓ కలియుగమే గడచి పోయి నట్టయింది. చచ్చి చెడి చాలగంటల పిమ్మటముల్లై గంటకన్నది గంటన్నర తరువాత, పిప్పళ్ళ బస్తాలా తయారయి బయలుదేరింది. ఇంటికి వెళ్ళేటప్పటికి రాత్రి ఎనిమిదయింది.

"ఎన్నింటికి బయలుదేరావు?"

"మధ్యాహ్నం పన్నెండుకి"

"అన్నట్టు మీ మామయ్య ఏం చేస్తున్నారు"

"పి డబ్లియు. డి సబ్ డివిజన్ ఆఫీసరు"

"అలానా! ఇంకేం; కిట్టుబాటు బాగానే వుంటుం దన్నమాట" అన్నాను. ఎందుచేతంటే లంచగొండితనం అంటే కాంగ్రెసు వాళ్ళెంత చీదరించుకొంటారో, మా వాడూ అంతే!

"ఒరేయి! నువ్వు మధ్య మధ్య పుల్లవేయక చెప్పింది విను. లేకపోతే టెంపో చెడిపోతుంది" అన్నాడు వాడు సీరియస్ గా.

"కానియ్ రా" అన్నా వాడి టెంపో చెడగొట్టడంఎందు కసిపించి.

మా వాడు మళ్ళీ కథలోకి వెళ్ళాడు: అక్కడ నాకు కాలక్షేపం బాగానే అయిపోయేది. ఫస్టుక్లాసయిన రేడియో వుంది. దాంట్లో ఇరవై నాలుగు గంటలూ రికార్డులు వాగిస్తూ కుర్చుండేవాడిని. ఆపయిన, అప్పుడప్పుడూ ఆయనతో 'కేంపులకు' బోటుమీద పోతుండేవాడ్ని. ఎంత హాయిగా వుండే దనుకున్నావు ఆ బోటు ప్రయాణం! కొబ్బరితోటల మధ్య నుంచీ; భూమి ఈనిందా అన్నట్లుగా నేలకు తగిలీ తగలనట్లుగా చెట్లనుండి వ్రేలాడుతున్న మామిడికాయలతో నిండిన మామిడితోటల మధ్యనుంచీ; మధ్యలో ఒయాసిసుల్లా, చుట్టూ ఎడారిలా, మధ్య మధ్య ఆకుమళ్ళతోనూ చుట్టూ సస్యం లేని భూములమధ్యగానూ పోతుండే ఆ కాలువపై ప్రయాణం చేస్తూ, ఉదయిస్తున్న భగవానుడితో ఒక వైపు అస్తమయం లోని అరుణుడితో ఒకవైపు ఉదయింపనున్న రేరాజుతో

కూడిన ప్రకృతిని చూస్తూవుంటే, నన్ను నేను మరచిపోయి, ఎక్కడో స్వర్గధామంలో వున్నట్టుగా వుండేవాడిని.

అక్కడ రేడియోవుందని, ఆయనతో గోట్లో షికార్లు కొట్టొచ్చని ఎంత మేనమామ అయితేమాత్రం, ఎన్నాళ్ళక్కడుంటాం చెప్పు? అందుకనే సమయంచూసి, "వచ్చి వారం అయింది, రేపు వెళ్తాను మామయ్యా" అన్నాను. "ఆఁ! తొందరేంరా! వెళుదువుగానిలే" అన్నా డాయన. వెళతా మంటే చుట్టాలు ఎక్కడన్నా వెళ్ళండి అంటారా? పెద్దవాడు చెపితే కాదనటం ఎందుకు, పైగా వెళ్ళి అక్కడే పెద్ద గుత్తానికి పళ్ళతోటమాలికనుక, అనుకొని రెండు రోజుల తరువాత వెళ్ళేందుకు నిశ్చయించుకొన్నాను

సరిగా రేపు వెళతాననగా ఆరాత్రి జరిగింది అసలయిన కథ. ఆ రాత్రికూడా, మామూలుగానే అంతా బయటపక్కలు వేసుకున్నాం. భోజనాలయ్యాయి. బాబిగాడు పడుకున్నట్టున్నాడు, రేడియోసంగీతం స్పష్టంగా వినిపిస్తున్నది. నేను పడుకొని ఆకాశాన్ని చూస్తున్నాను. మామయ్య బయట చెయిర్ వేసుకొని ఆఫీసుపని చూసుకుంటున్నాడు. ఇంతలో మైలుకూలీ భుజంగరావు వచ్చాడు.

"దండ్నవండి అయ్యా" అంటూ మొదలుపెట్టాడు. "గుమ్మంపాడు లాకుదగ్గర సున్నా నాలుగుందండి. నెంబరు టూ దగ్గర సున్నా ఒకంటుందండి మీరు చెప్పినట్టే పల్లాలకు తగ్గించి మెరకలకు వదిలాం"...అంటూ పాఠం వప్పచెపుతున్నాడు.

ఇంతలో ఉన్నట్టుండి నాకు ఎక్కిళ్ళు ప్రారంభించాయి. మామూలుగా మనం ఎక్కిళ్లువస్తే ఇన్నిమంచినీళ్లుతాగుతాం అలాగే నేనూ ఇన్నితాగాను. ఊహుఁ! తగ్గలేదు.

"ఎక్కిళ్ళు వస్తున్నాయేమండీ అబ్బాయిగారు" అన్నాడు భుజంగరావు

"ఏమోనోయ్! నాకేసున్నా కారణం చెప్పివస్తు న్నాయి కనుకనా!"

"మంచినీళ్లు త్రాగినట్టున్నారు కూడాను, తగ్గనే లేదాండీ"

"లేదోయ్!" అంటూ వెళ్ళిపడుకున్నాను.

వాడు మామయ్యతో మాట్లాడటం పూర్తయినట్టుంది, నా కేంప్‌కాట్ దగ్గరకువచ్చి, "అయితే, అబ్బాయిగారూ! ఆ మైలుకూలీ సుబ్బారావుని ఏదో అన్నారట ఎందుకండీ" అన్నాడు నేలచూస్తూ.

"మైలుకూలీ సుబ్బారావునా! నేనా! ఏదో అన్నానా!" అంటూ నిర్ఘాంతపోయి చూస్తున్నాను.

"అతను చాలా నెమ్మదయినోడండి. ఉత్తపున్నానికి మీ రెందుకన్నారా, అని నేను నమ్మలేదంటే నమ్మండి"

"అసలేమీ అననే లేదోయ్! నువ్వు సరిగ్గా విన్నావా?"

"సొట్టంగా సెబుతేనండి, అయ్యగారి మేనల్లుడుగారు" అని.

"ఓరి పిడ్డి తగలెయ్య వీడికిదేంబుద్ధి"

"ఏమీ అనకపోతే ఎందుకంటాడురా" అని మామయ్య అందుకున్నాడు.

ఇక నా పని ఎలా ఉంటుందో నువ్వే ఊహించుకో మతిపోయినంత పనయింది! ఏం చెయ్యడం? నిజానికి ఏమీ అనందే ఎందుకంటాడు? ఒకవేళ, నాకు తెలియకుండా నే నేమయినా అన్నానేమో అని చాలాసేపు జ్ఞాపకం చేసుకుందామన్నా జ్ఞాపకానికి వస్తేగా! అసలు చెయ్యనిపని గుంజుకు చస్తేమటుకు జ్ఞాపకం వస్తుందా!

"నువ్వెళ్ళి ఆ సుబ్బారావుని లాక్కురా. సంగతేమిటో తేల్చుకొంటేనే కాని లాభంలేదు" అన్నాను కొంచెం కోపంగా, వస్తున్న ఎక్కిళ్ళు నాపుచేసుకొంటూ.

"ఇప్పుడెందుకులెండి రేపు చూచుకోవచ్చు. అసలు నేనూ మిమ్మల్ని అడిగేవాణ్ణే కాను కాని వాడు కళ్ళంపట నీళ్ళతో చెప్పాడు కనుక ఏంటో అని అడిగానంతేనండి"

నాకు నిజంగా పిచ్చెక్కింది. పొద్దున్న లేచి ఎవరిముఖం చూశానో, ఏంరా! భగవంతుడా అనుకొన్నాను.

"బంట్రోతోళ్ళుగదా, అని ఏమీ అనబోకండి అబ్బాయిగారూ! ఇప్పుడిక సరిపోయింది కాని, ఆ పోలిగాడయితే మొఖంమీద కుండబద్దలు కొట్టినట్లు తెగేసిఅంటాడు" అని ఆ మైలుకూలీ భుజంగరావంటూంటే నాకు వళ్ళు తెలియనంతకోపం వచ్చింది. "నోర్ముయ్! పిచ్చిపిచ్చిగావాగక వెళ్ళి వాడ్ని తీసుకురా. వాడిసంగతీ, నీ సంగతి కనుక్కుంటాను.

ఏమన్నా అంటే అన్నవాడికి నాకు తెలియదాంఅంట. పైగా నాకు బుద్ధులు నేర్పుతావు పెద్ద మొనగాడిలా" వాడిమీద లేచాను.

"అది సరేలే కాని, నీకు ఎక్కిళ్లుపోయాయిరా!" అన్నాడు మామయ్య ఇంక లాభంలేదనుకొని.

"పోయాయి" అన్నాను పెధవఎక్కిళ్ళకు ఆయనంత శ్రద్ధతీసికోవడం గురించి అట్టే ఆలోచించకుండానే.

"అబ్బాయిగారూ మీరు చమించాలి. మీరేమో ఎవర్నీ అననేలేరండి. పాపం ఏమీ ఎరగనే ఎరగరు అంతా నేనే కల్పించిచెప్పానండి. ఇలాగే నాకోసారి ఎక్కిళ్లువస్తే మాఅయ్య కంగారుపెట్టేశాడు. ఏదో చెయ్యనిపని చేశానని అంటూ సీలాగే, తర్వాత ఎక్కిళ్ళు పోయిరాయి. అప్పుడు చెప్పాడు ఎక్కిళ్ళువస్తే మనిషిని కంగారుపెడితే పోతాయని. అప్పటినుంచీ ఎక్కిళ్ళకీ మందు ఉపయోగిత్తన్నానండి. మరేమీ అనుకోకండి మామయ్యగారు గ్రహించేరుకాని మీరు గ్రహించలేక పోయారు." అంటూ ఓ దీర్ఘోపన్యాసం ఇచ్చాడు.

"ఓరి నిన్ను తగలెయ్యా! చంపేశావుకదరా! మంచి మందే!" అనుకున్నాను. ఏంచేస్తాను కనుక!

"నాకు తెలుసురాబాబూ; నువ్వు చివరకు తున్ను మనిపిస్తావు అని మొదట్లోనే అనుకున్నాను" అన్నాను మణ్యంగాడితో నవ్వుతూ.

"ఏడిశావులే, నీకు తెలుసూ ఈసంగతి?" అన్నాడతు వాడు.

"తెలియదు" అన్నా.

"మరింకేం? ప్రతిదీ తెలుసుననుకోవటం పరిపాటయింది. మనకు సజానికి ఏమీ తెలియదు" అన్నాడువాడు భావ కవి పోజులో.

"అవును నిజమే! మనకు చిన్న విషయాలు చాల తెలియనే తెలియవు. అన్నీ తెలిసినట్లే ఉంటూ, తెలియని విషయాలను గురించి తెలుసికోవటం, ఇప్పుడు నాగరికతా చిహ్నం. అది సరేకాని, తరువాత ఏమయింది"

"ఇంకేముంది నాబొందా, నీబొందా, ఆమర్నాడు ఇంటికి వచ్చేశాను" అన్నాడు మావాడు తనకథ ముగిస్తూ.

"నీ జీవితంలో అనుకోనని సంఘటనలు జరగకపోతే నీవు నీ జీవితంగురించి ఏమీ తెలిసికోనలేవు" అన్న పీటర్ చెనీ మహాశయుని తలుచుకుంటూ, మంచి భాగా కాలక్షేపం అయిందనుకొని, మళ్లీ రేపు ఆ కాఫీహోటలువద్ద కలుసుకోమని వాడితో చెప్పి ఇంటికి బయలుదేరా నావేళ



# తీరని కోరిక

వయస్సు మళ్ళుతున్నకొద్దీ, కోరికలు రూపాంతరము పొందుతుంటాయి. చిన్నతనంలో, తిన్నన్ని లడ్డూలు పెడితే చాలనుకుంటారు. కొంచెం పెద్దయితే మంచి చొక్కా, లాగూ వేసుకొంటేనే చాలు, ఇంకేమీ అక్కరలేదు అనుకుంటారు. ప్రపంచజ్ఞానం తెలిసేక, పెద్దఉద్యోగాలు చేయాలని, లేకపోతే 'టిక్కు టక్కు టముకులబండి' అని పాటలు పాడుతూ సినిమాలలో నటించాలని, హిందీ, ఇంగ్లీషు సినిమాలు చూచి, 'రాబిన్ హుడ్,' 'సూపర్ మేన్'లా అవాలని అనిపిస్తుంది. ఇంకా పెద్దయ్యాక, అంటే ఇంచుమించు ఇరవై ఏళ్లు సమీపించాక, హృదయంలో కోరికలు రూపాలు తీర్చి దిద్దుకొని, ఊటలూరి, అంచులు దాటుతోంటే తియ్యని కలలు కంటూ

"కలలు నిజము కాగా
కలకాల మొకటి......గా"

అని పాడుకొంటూ జీవితంపై అంబరం చుంబించే ఆశలతో వుంటారు. ఆ తరువాత చాలా కాలానికి ఆ ఆశలు ఫలించక కొందఱు హృదయంలో స్మశానాన్ని సృష్టించుకొని ఎండుపరమైతే 'ఊరు పొమ్మని, కాడు రమ్మనే' పరిస్థితులలో 'రామనామ సంకీర్తనమే రక్తి ముక్తి' అంటూ జపతపాలతో కాలక్షేపంచేస్తూ భగవంతునిలో ఐక్యమైపోవాలనుకుంటారు.

కాని శాంతమనస్సులో కోరిక ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే అన్నట్టు మార్పుచెందలేదు. తిన్నన్ని

లడ్డూలు పెడితే చాలనుకుంటాం చిన్నతనంలో. కానీ, తిన్నన్ని ఎవరూ పెట్టరు. అమ్మ నడిగి ఒకటి, నాన్న దగ్గ రొకటి, బామ్మని బెలిపించి ఇంకొకటి, చెల్లాయిని ఏడిపించి మరొకటి. ఇలా మహా తింటే నాలుగు గుండుకు మించవు. అయితే, తిన్నన్ని దొరకపోయినా కొన్నాళ్ళకా ధ్యాస పోతుంది. ఆ తర్వాత ఇంకోదానిపై మనస్సు పుడుతుంది. శాంత కోరిక ఇలా పోలేదు. నానాటికి హృదయంలో తిష్ట వేసుకొని కూర్చున్నది. ఆమె తీరనికోరిక, ఏమిటంటే తను చెప్పే ప్రతీమాట, సలహా ఎవరూ పాటించక పోవటమే!

"అమ్మా!...ఏదయినా పెట్టవే..." అంటుంది శాంత.

"ఇప్పుడు కాదు" అంటుంది అమ్మ.

ఇప్పుడు కాక మరెప్పుడో? అడిగినప్పుడు పెట్టదు.

"అమ్మా! కాలవకి నీళ్ళకు వెళ్ళనా?"

"వద్దమ్మా! జారిపడతావు"

హుం ఏది చేస్తానన్నా వద్దంటుంది

"పోనీ వంకాయలు తరగనా?"

"చెయ్యి తెగేను వద్దు! ఏమీ వద్దు!

"తమ్ముడ్ని ఆడించు శాంతా!"

"నేను ఆడించలేను బాబు ఆ విధవ నాదగ్గరుండడు"

చేస్తానన్నది వద్దంటుంది చెయ్యనన్నది చెయ్యి అంటుంది ఏమిటో?

"సరేలే అమ్మ!" అని ముద్దుగా నాన్నగాని, అమ్మ గాని శాంతమాటకు ఒక్కసారి కూడా సమాధానం చెప్పలేదు.

అయినా ఆ పసి హృదయానికేం తెలుసు మాతృప్రేమ? కాలవకు నీళ్ళకుపోతే జారిపడుతుందేమో? వంకాయలు తరుగుతుంటే చెయ్యి తెగవచ్చు—ఎప్పుడూ తాయిలాలు తింటూంటే అజీర్తిచేసి జ్వరం వస్తుంది. అందుకనే అమ్మ శాంతనేమీ చేయనీయదు అంటే, ఆ పసిహృదయానికిదంతా తెలియదు. పెళ్ళయి పిల్లల్ని కన్నాక తెలుస్తుంది కడుపుతీపి.

పోనీ నాన్న సంగతి చూద్దామా "నాన్నా! మంచినీళ్లు కావాలా?' అంటే "అమ్మనుపిలు శాంతా! కాఫీ తెమ్మను" అంటాడు నాన్న. కాఫీ తాగుతాడుకదా అని మరునాడు ఆఫీసునుంచి రాగానే "కాఫీ తేనా, నాన్నా!" అంటుంది శాంత.

"వద్దమ్మా దార్లో తాగేవచ్చాను కాసిన్ని మంచినీళ్లు తీసుకురా అంటాడు!" నాన్న.

దార్లో పాతస్నేహితు డొకడు కనపడి కాఫీహోటల్ కి బలవంతంగా తీసికెళ్ళాడు నాన్నని. కాఫి తాగడానికీ కాలంలో సమయ సందర్భాలు లేకపోయినా, నాన్న రోజుకి రెండుసార్లే తాగుతాడు, పొద్దున్న, సాయంత్రం. 'మానవులు అలవాట్లకు బానిసలు' అన్న సంగతి శాంతకు ఇంకా తెలియదు.

"నే బెల్లముక్క తెస్తా" అనేది శాంత బువ్వలాటల్లో.

"ఊహుఁ! పంచదార తే!" అనేవారు జట్టువాళ్లు.

"మేము ఆడపెళ్ళివారం మాబొమ్మ పెళ్ళికూతురు."

"వీల్లేదు, మాబొమ్మ పెళ్ళికూతురు."

ఇలా, బువ్వాలాటల్లో కూడా శాంతమాట ఎవరూ వినేవారు కారు. ఇది శాంతకు మరింత పిచ్చెక్కించింది. అపును పాపం! ఇంకా శాంతకు స్వార్థం తెలియదు. ఇంట్లో అమ్మా, నాన్న, కాక స్నేహితురాండ్రు కూడా తన మాటవినరేమి టాఅని స్వతహాగా దెబ్బలాడే తరహాలేని శాంత అనుకొనేది.

♦ ♦ ♦ ♦

అవి నాన్నకు వేసవిశెలవలు. నాన్న శాంతను వాళ్ళ బామ్మగారింటికి తీసికెళ్ళాడు. బామ్మపిండివంటలలో నాన్నకు, శాంతకు మస్తుగా వండిపెట్టేది ఒకరోజున శాంత ఏమీ తినకపోతే "అయ్యో అపురూపమా! కొంచెం వేసుకోవే" అనేదిబామ్మ. అవాళ బామ్మ క్షీరాన్నం చేసింది. శాంతకు క్షీరాన్నం అంటె అబ్బ! మహాయిష్టం. అందుకనే మూడుసార్లు వేయించుకుంది.

"కాస్త చూసుకొని తినవేపిల్లా" అందిబామ్మ. శాంత హృదయం చివుక్కుమంది. వద్దంటే వేయించుకోమంటుంది. ఇష్టమయినది కాస్త వేయించుకొనితింటే చూసుకొని తిన మంటుంది. ఎలా చచ్చేదీ? శాంతకు రానురాను పెద్దాళ్ళంటే చిరాకుపుట్టింది పిల్లలనేద ప్రతీదీ, వాళ్ళుచేసే ప్రతిపనీ పెద్దలు కాదనాలి కాబోలు, తనూ పెద్దయ్యాక, తన పిల్లలమాటలు పనులూ, "అలా కాదు" "ఇలాకాదు" అనాలి కాబోలు సని సరిపెట్టుకుంది శాంత.

♦ ♦ ♦ ♦

కాలం చాలా జోరుగా పరుగెడుతుంది. శాంత నేను వివాహితను. చిన్నప్పుడు తన మాటలను అంతా తోసేసేవారు. పెద్దయితే తన మాట చెల్లుబడవుతుందనుకుంది. ఇప్పుడు తను పెద్దయింది మాత్రమే కాదు దేవికూడా కాబోతుంది అటువంటి తన మాటంటే కట్టుకున్న మొగుడునుంచీ, అంట్లుతోమే సుబ్బి దాకా అందరికీ నిర్లక్ష్యమే – అందరూ వ్యతిరేకంగా అనేవారే!

"అత్తయ్యా! కూరేం చేయమంటారు?"

"ఏదో ఒకటి చెయ్యవే" అంటుంది అత్త. తీరా వంటయిపోయాక విస్తరిముందు "ఏమిటిచేశావే కోడలుపిల్లా" అంటుంది.

'అరటికాయ వేపుడు, పప్పులుసూనండీ"

"కొబ్బరి పచ్చడి చేయకపోయావూ" అంటుంది. మొదట చెప్పకూడదూ!

"ఒసేయి! సుబ్బీ ముందీగది చిమ్ము"

"ఉండండమ్మా! ఏంటి మీాకు" అని కసురుతుంది సుబ్బి.

"పెళ్లి చేసిచూడు" చాలా బాగుందిట తీసికెళ్ళరూ?"

"అది అమ్మనడగవలసిన విషయం" అంటారు మొగుడుగారు.

ఇక ఇంట్లో కష్టసుఖాలు భర్తతో చెప్పుకొంటే "అబ్బబ్బ, యిలాంటివన్నీ వస్తాయనే, నే నసలు పెళ్ళేవద్దన్నాను.

అయితే? విధి వదలదుగా" అంటున్నా, కించెత్తైనా ఆ వాతావరణాన్ని అర్థంచేసుకోని భర్త.

"అయితే మడికట్టుకొని కూర్చోలేకపోయారా? సన్యాసుల్లో కలిస్తే మరీ బాగుండేదిగా!" అని శాంతహృదయంలో ఎవరో చెప్తున్నట్టుండేది.

"ఆఁ! తప్పు. ఆయన నెదరుకున్నావు; ఏ భర్త' భారతనారీమణులను మరచిపోయావుటమ్మా? సీత, సావిత్రి' దమయంతి"......అంటూ అంతరాత్మ గోలపెట్టేది.

"ఖర్మం కాకపోతే మరేమిటి, నే ననుకున్నది నా అంతరాత్మ కాదంటుంది; ఇక ఇతరులు అనటానికేం?" అను కొనేది శాంత.

రోజులు గడుస్తున్నకొద్దీ శాంతకా వాతావరణం అలవాటయిపోయింది. భర్త లాలన పాలనల్లో ఆమె అనురాగ సుఖాన్ని పొందుతున్నా, ఆమెలో అసంతృప్తి ఉండి ఉండి తలెత్తుతుండేది.

ప్రజలు ఆకలిదప్పులతో "అన్నమో రామచంద్రా" అంటూ అరుస్తూన్నా; బొజ్జలుపెండిన దొరలువిర్రవీగుతున్నా; "చక్కిలిగింతలు లేవా, చక్కని ఊహలు రావా" అని ప్రణయ విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైన యువతీయువకులు కేరింతలు కొడుతూ, మధుర మాధురాసక్త హృదయాలతో స్వర్గసీమల్లో కన్నూ, మిన్నూ, కానక స్వేచ్ఛా విహారం

చేస్తున్నా, వున్నట్టుండి మానవులు సూర్య, చంద్రగోళాల్లోకి ప్రయాణం సాగించబోతున్నా, యుగాంతానికి నాందిగా యాటంబాంబులు సృష్టింపబడుతూన్నా, ఏమయినా సరే— కాలచక్రం నిల్వోరబోదు, కాస్త ఆగి పరికించి చూడనైనా చూడదు, దాని పని దానిదే!

ఇప్పుడు శాంత ఇంట్లో సర్వాధికారిణి. ఆమెమాటకు తిరుగు లేదంటే—లేదు. ఆమె నలుగురుబిడ్డలతల్లి కూడా!

"చిట్టీ! నాన్నగార్ని స్నానానికి రమ్మను, నీళ్లు చల్లారిపోతాయి"

వెంటనే నాన్న స్నానంచేసి వెళ్ళేవాడు

"పిల్లలూ — పదయింది బడికి పోరేం!"

పిల్లలు మాట్లాడకుండా బడికి వెళ్ళేవారు.

"ఓసే అప్పలనర్సా ఆగకె ముందు చిమ్ము" అలాగే చేసేది అప్పలనర్స.

"ఈ వాళ సినిమాకు వెళదాం తొందరగా రండి"

"అలాగే" అనేవాడు— పూర్వం "అమ్మ నడుగు" అన్న భర్త.

జీవితం సుఖమయంగా జరుపుకోవాలంటే పరిసర వాతావరణాన్ని అనగాహన చేసుకోవాలి. ఇది చిన్నతనంలో అర్ధం కాని విషయం కావచ్చు, అయినా బుద్ధిమంతులయిన

పెద్దల సహాకారంతో పిన్నలు తమ భావిజీవితాన్ని మధురాతి మధురంగా తీర్చి దిద్దుకోవచ్చు.

కొందరు పెద్దలే ఈ విషయాన్ని గమనించక అనవసరంగా బాధపడతారు. అందుకు శాంత ఒక చక్కని ఉదాహరణ ఆమె ఇప్పుడు పొందుతున్న సంతృప్తి ఎన్నడు ఎరుగనే ఎరుగదు. అందుకు కారణం శాంతకు తెలియదు ఇక ముందు మాత్రం తెలుస్తుందా? తనలో చిన్నప్పటినుండీ గూడుకట్టుకొనిపోయిన కోరిక ఇప్పటికి తీరిపోయింది అనుకొంది శాంత. వాతావరణాన్ని అవగాహన చేసుకోలేని శాంతకోరిక ఇప్పటికి తీరిందని, ఆమె అనుకోవటంలో ఆశ్చర్య మేముంది!



# కథ చేసిన మేలు

అది ఏప్రిల్ నెల. ఊరందరికి ఒక దారి ఉలిపికట్టె దొక దారినట. అన్ని కాలేజీల్లోనూ మొదటి సంవత్సరం వాళ్ళకు ముందయి పోతాయి పరీక్షలు. మా కాలేజీలో మాత్రం యూనివర్సిటీ పరీక్షలయ్యాక ఈనెలలోనే అయ్యాయి.

నిన్న సాయంకాలం వరకూ ఎందెందు వెదకిచూచిన అందందే అగుపించిన కాలేజీ విద్యార్థులు అదేం చిత్రమో ఈవాళ సాయంత్రానికి ఒక్కడూ అయిపులేడు. ప్రొద్దుట పరీక్షలయ్యాయి. సాయంకాలానికి ఒకడైనా కనిపిస్తేనా! వీళ్ళంతా అంత యమర్జంటుగా వెళ్ళి, ఏ పెద్ద గుట్టాలకు పళ్ళెంలో మాయలో కాని—

కాలక్షేపం కావటం కష్టంగానే వుంది. మా లైబ్రరీకి కొత్త పుస్తకాలయితే వచ్చి మూడు నెలలైంది కాని వాటిని చదివే భాగ్యం మాకింతవరకూ పట్టలేదు. అందుచేత లైబ్రరీకి వెళ్ళి ప్రయోజనం లేదు కనుక అలా పార్కుకి పోదామని బయలుదేరాను. దారిలో కిళ్ళీకొట్టుమీద కొత్త వారపత్రిక కనపడింది. "ఈవాళ ఏం వారం అబ్బా!" అంటూ ఆలోచించి, చివరకు సోమవారం అని ధృవపరుచుకొని "ఏమిటో! పరీక్షలయిపోతే వారాలు కూడా జ్ఞాపకం వుండటంలేదు" అనుకొంటూ వారపత్రిక కొనుక్కొని పేజీలు తిరగవేస్తూ ఫుట్‌పాత్ మీదంచి నడిచి వెళుతున్నా.

"జాగ్రత్తగోయ్! ఎవరికైనా డామ్ ఇవ్వగలవు, క్రింద చూపే కాని పై చూపు లేదా!" అనటం నా వీపుమీద ఒక్క చరుపు పడటం ఒక్కసారే జరిగాయి. ఎవరా? అని వెనక్కి తిరిగాను. కృష్ణమూర్తి కనుపించాడు. కృష్ణమూర్తి, మేం నరసాపురంలో వుండేటప్పుడు మా ఇంటి ఎదుటి ఇంట్లో వుండేవాడు. మేం ఇద్దరం టైలర్ హైస్కూల్లో ఎస్ ఎస్ ఎల్ సి. ఒకసారే పాసయ్యాం. దాని తరువాత ఇక్కడకు వచ్చి కాలేజీలో చేరాను. కృష్ణమూర్తి ఉద్యోగంలో చేరాడు.

"ఇప్పుడెక్కడ వుంటున్నావ్ రా?"

"అక్కడే!"

'ఏం ఇలా వచ్చావ్; ఎవరైనా బంధువులున్నారా?'

"చిన్న పనిమీద వచ్చాలే; పరీక్షలయిపోయాయా?"

"ఆఁ!"

"రా, కాఫీ తాగుదాం" అంటూ రహీం దగ్గిరలోకి లాక్కుపోయాడు. కాఫీ తాగి బయటికి వచ్చేసరికి "వార్తలు చదువుతున్నది పన్యాల రంగనాధరావు" అని బడేఖాన్ పార్కునుంచి వినబడుతోంది.

ఇద్దరం నెమ్మదిగా పార్కు చేరాం. ఆసనం చూసుకొని కూర్చునేసరికి "ఇక వివరాలు" అంటోంది రేడియో.

నా చేతిలో పత్రిక లాక్కుని బొమ్మలు చూస్తూ "ఎందుకురా ఈ అయింట్‌మెంట్? ఏ లైబ్రరీకన్నా వెళ్ళి చదువుకోరాదు వదిలిపోయేదానికి" అన్నాడు కృష్ణమూర్తి.

"సరేలే; లైబ్రరీకి వెళ్ళి చదివినట్టే. ఎంత ముందుగా వెళ్ళినా ఎవడో ఒకడు దీన్ని గుత్తకుపుచ్చుకుని కూర్చుం టాడు. ఇక ఆ మహానుభావుడు దాన్ని వదలడు అందులోనూ తన చేతిలో పుస్తకంకోసం ఇంకోవ్యక్తి కాచుకొని కూర్చు న్నాడని తెలియగానే, లైబ్రరీ మూసేవేళకుకాని ఆ వ్యక్తి ఆ పత్రికను వదలడు. ఇలాంటి వ్యక్తులు కాక, ప్రతి లైబ్రరీకి కొందరు అభిమాన పురుషులు వుంటారు. మొట్టమొదట లైబ్ర రీకి వచ్చిన ప్రతీ పత్రికా వాళ్ళు చదవందే మరొకరు చదవ లేరు. ఇన్ని గండాలూదాటి పుస్తకం మన చేతికి వచ్చేసరికి మళ్ళీ సోమవారం రానే వస్తుంది. ఎందుకొచ్చినబాధఇదంతా కొనుక్కుంటే తీరిపోతుంది" అన్నాను.

"అది నిజమే!......ఈ కథలు కేవలం కాలక్షేపా నికే పంటాఁవా?" అన్నాడు వాడు.

"కాకపోతే, శాస్త్ర విజ్ఞానం కూడా ప్రసాదిస్తాయి."

'అదికాక, ఈ కథలు మనమీద కొంత ప్రభావం చూపెడుతున్నాయి" అన్నాడు కృష్ణమూర్తి.

"అదెలా?"

"అదెలాగో చెప్పనా?" అంటూ కృష్ణమూర్తి చెప్పటం ప్రారంభించాడు.

ఇది నిజంగా జరిగిన సంగతి, ఇదేం కథనుకోకు. వాళ్లు చాలా భాగ్యవంతులు. ఆ ఇంటి యజమాని రామయ్యో నాయుడుగారికి రెండు వందల ఎకరాల పొలం వుందని ఆ వీధిలో అంతా అనుకుంటారు. వాళ్లుమాత్రం రెండువందల

యాభై యకరాలని చెప్పుకుంటారు. వాళ్లు భాగ్యవంతులు కనుక వాళ్ళకి ఓ కారువుంటనీ, వాళ్ళ ఇల్లు ఒక మహా సౌధం అని, వాళ్ళ ఇంటి కిటికీలకు, గుమ్మాలకు తెర లుంటాయని, ఇంటిముందు చిన్న వనం వుంటుందని ఎవరయినా అనుకొంటే పూర్తిగా పొరపడ్డట్లే !

రామయ్యనాయుడిగారికే కాక ఆ ఇంట్లో అందరికీ డబ్బుకి ప్రాణానికి లంకె. ప్రపంచంలో అవసరాలకు డబ్బు ఖర్చుపెట్టని పిసనారివాళ్ళు చాలామంది వుంటారు. కాని, రామయ్యనాయుడుగారి కుటుంబం అవసరాలకు డబ్బు ఖర్చు చేయరు సరికదా, ఇతరులు ఖర్చుపెట్టడం చూసికూడా సహించలేరు.

పిసనారి వాళ్ళకూ కొన్ని తప్పనిసరి ఖర్చు లుంటాయి. రామయ్యనాయుడు గారు వార పత్రికలు, మాసపత్రికలు కొని విధిగా చదువుతుంటారు. చాలామందిలో ఒక అభిప్రాయం వుంది; యువకులే కాని వయసు మళ్ళినవారు కథలు, నవలలు చదవరని. అది కేవలం అపోహ అని రామయ్యనాయుడు గారు ఋజువు చేశారు.

ఇక రామయ్యనాయుడుగారి కుటుంబపరిస్థితి; నాయుడు గారికి ముగ్గురు ఆడ సంతానం, ఒక మగ సంతానం. కొడుకు ఇంటర్మీడియట్ క్లాసులో పార్టు త్రీలో కుస్తీ పడుతున్నాడు. కూతుళ్ళిద్దరు పెళ్ళికి సిద్ధంగా వున్నారు. రామయ్యనాయుడుగారు, పెద్దమ్మాయి పెళ్ళి చేయాలని అయిదేళ్ళనుంచి ప్రయత్నమట. కాని యింతవరకూ ఆయన సఫలుడు కాలేకపోయాడు.

కిట్టనివాళ్ళే అనుకుంటారు రామయ్యనాయుడు గారి గురించి.

"అప్పుడే ఏం తొందరమ్మా, ఇప్పుడే పెళ్ళిచేస్తే పది వేలూ ఈనాడే అల్లుడికియ్యవలసివస్తుంది. రెండుమూడేళ్లాగితే ఆపదివేలపై రెండుమూడు వేలన్నా వడ్డీ, రాకపోదు, అది పెట్టి పెళ్ళిచెయ్యవచ్చు, అసలు అలాంటి దేమయినా చెయ్యదల్చుకొంటేను?" అని అమ్మలక్కలు చెప్పుకోవటం ఒకసారి నేనుకూడా వినటం జరిగింది.

ప్రపంచంలో ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యలేక బాధపడేది డబ్బు లేనివాళ్లు. కట్నాలు ఇవ్వలేక, తామిచ్చే కట్నాలకు సరైనవరుడు దొరకక బాధపడటంవుంది. కానీ డబ్బు పేరబెట్టున్న రామయ్యనాయుడుగారి వంటి ధనికుడు కూతురు పెళ్ళిచేయటానికి ఎందుకు వాయిదాలు వేస్తున్నాడా అని ఆ వీధివారంతా ఆశ్చర్యపోవటంలో తప్పేముంది?

ఒకరిద్దరు "అమ్మాయిగారి పెళ్ళెప్పుడండీ" అని అడిగి రామయ్యనాయుడుగారిచేత ముఖంవాచే చీవాట్లు తిన్నట్లు కథలు వున్నాయ్. అందుచేతనే ఆ ప్రసక్తి ఆయన ముఖం ముందు తేవటానికి ఎవరికీ దమ్ములుండేవికావు

ఇలా వుంటూండగా, ఒకనాడు రామయ్యనాయుడుగారి ఇంటిముందు కూలీలు పందిరి వేయటం ప్రారంభించేసరికి అక్కతంబేమో తెలియక ఆ వీధివారంతా నోళ్లుతెరచి అలా చూస్తూవుండిపోయారు. చివరకు తర్జనభర్జనలమీదట ఆ

వీధివాళ్ళు గ్రహించిందేమంటే రామయ్యనాయుడుగారి అమ్మాయి వివాహం అని.

రామయ్యనాయుడుగారి అమ్మాయి వివాహం జరు ప్రసంగానే ముగిసింది. కట్నం కొంత బకాయి వేద్దామని నాయుడుగారు ప్రయత్నించారుకాని, అల్లుడు పీటలమీంచి లేచిపోతే ఇంట్లోకి వెళ్ళి తక్కిందికూడా తెచ్చి ఇచ్చాడాయన.

రెండురోజుల తరువాత, ఆవేళ సాయంకాలం నేనూ నా రూమ్‌మేట్ రామం తూర్పు లాకుల దగ్గరకు వెళ్ళాం షికారు పిచ్చాపాటీ మాట్లాడుకొంటూ తిరుగుముఖం పట్టే సరికి మసగమసగ చీకటి పడింది. రైల్వేస్టేషన్ సమీపానికి వచ్చేసరికి మాకు ముందు ఇద్దరు వ్యక్తులు వెళుతున్నట్లు గమనించాం. అందులో ఒకాయన "టక్...టక్" మంటూ శబ్దం చేసుకొంటూ చేతికర్ర సహాయంతో నడుస్తున్నాడు. ఇంతలో ఒకాయన సన్నగా దగ్గి "మా అమ్మాయి పెళ్ళి ఇంత అకస్మాత్తుగా చేయటం చూసి మా వీధివాళ్ళెంత ఆశ్చర్యపోయారనుకున్నావ్" అన్నాడు ఆ కంఠస్వరం మాకు చిరపరిచితమయినదిగా వినిపించింది.

"అలాగా!" అన్నాడు రెండో వ్యక్తి.

"కారణం ఏమిటో తెలుసా?" అన్నాడు మొదటివ్యక్తి మళ్ళీ.

"ఏమిటి!"

"నేను కథలు, నవలలు చదువుకొంటాను నీకు తెలుసుగా; నాకు చిన్నప్పటినుంచి అదో అలవాటయిపోయింది.

మొన్న వారంపత్రికలో "ఎవరిది తప్పు ?" అన్న కథ చదివాను. నా మనస్సంతా కెలికినట్టయి పోయింది. కీడెంచి మేలెంచాను. మా అమ్మాయిపెళ్ళి అనుకోకుండా చేయటానికి కా కథే కారణం."

"అలానా ! ఆ పత్రిక నీ దగ్గరవుందా" అన్నాడు రెండో వ్యక్తి.

"ఆఁ ! వుంది, నువ్వుకూడా చదువుదువుగానిలే."

మేం ఇద్దరం ఊపిరి బిగపట్టి వింటున్నాం; పెద్ద హత్యా రహస్యం పొంచి వింటున్నట్టు.

ఆ ఇద్దరు వ్యక్తులు సినిమాహాలు దాటి వంతెనమీదంచి రోడ్డుపట్టారు ఆ వంతెనమీదికెళ్ళినుకాలాలనుంచి ప్రసరితమవుతున్న ట్యూబులైట్ల కాంతిలో ఆ ఇద్దరు వ్యక్తులు మాకు స్పష్టంగా అగుపించారు ఆ ఇద్దరూ: ఒకరు రామయ్యనాయుడుగారు, రెండు పెళ్ళికివచ్చి రామయ్యనాయుడిగారి బలవంతంమీద వున్న ఆయన చిన్ననాటి స్నేహితుడు గోవిందరావుగారు.

దారిలో కనపడితే, ఆ వారం పత్రిక కొనుక్కొని వెళ్ళాం. రామయ్యనాయుడుగారు చెప్పినకథ చదివాను.

ఒక డబ్బుగల వ్యక్తి తన దర్జాకుతగ్గ వరుడుదొరక్క కూతురుపెళ్ళి చేయటానికి కాలవిలంబన చేస్తోంటాడు ఆ అమ్మాయి సహజమయిన తన కోరికలను ఎప్పటిదాకానో అణచుకోలేక - తీర్చుకొంది. ఫలితంగా పాపాయివుట్టే సూచనలు కన్పించాయి. ఆమె తనప్రియుడితో వెళ్ళిపోయింది.

పాలసముద్రంవంటి ఆ ఇంటివారి వంశానికి మాయనిమచ్చను వదలి, కూతురుకోసం బెంగ పెట్టుకొని తండ్రి మంచంపట్టి మరణించాడు” ఇదీ సంక్షిప్తంగా ఆ కథ.

రెండు మాసాల తరువాత ఒకనాడు పోస్టుమేన్ రామయ్యనాయుడిగారి అమ్మాయి పేర ఒక మనియార్డర్ తెచ్చాడు. ఆ అమ్మాయి అప్పుడు అత్తవారింట్లోవుంది. రామయ్యనాయుడుగారుకూడా సమయానికి ఇంట్లో లేకపోవటం జరిగింది నేను ఎవరుపంపారా మనియార్డరని చూశాను. “మా పత్రికలో ప్రచురించబడిన ‘ఎవరిది తప్పు?’ అను మీ కథానికకు ఈ మొత్తం పారితోషికంగా పంపడమైనది. అందినట్లు వ్రాయండి” అని వుంది ఆ మనియార్డరు కూపను మీద అనిఆగాడు కృష్ణమూర్తి. నేను ఆశ్చర్యపోయాను కాసేపు.

“మరిఆఅమ్మాయి పేరు పత్రికలోపడలేదూ?” అన్నాను.

“లేదు. కాంతం అని పడింది. ఆమెపూర్తిపేరు సూర్య కాంతం. ఆ కాంతం తన కూతురు సూర్యకాంతం అని రామయ్యనాయుడుగారెలా అనుకొంటాడు.”

“రామయ్యనాయుడుగారి గురించి ఇంత విపులంగా చెప్పావ్, ఆయనతో నీకుగల సంబంధం ఏమిటి?” అనడిగాను.

“ఆయన ఇంటి వీధి గదిలో నేనూ, మా ఆఫీసులో ఇంకో గుమాస్తా రామం అద్దెకుండే వాళ్ళం” అంటూ కృష్ణమూర్తి పక్కు దులుపుకొంటూ లేచాడు. “ఇంతటితో నేటి గ్రామస్థుల కార్యక్రమం సమాప్తి” అంటోంది రేడియో. కథ చేసిన మేలుతలుచుకొంటూ పార్కునుంచి బయటపడ్డాం ఆ వేళ

---

# ఒకటో తారీఖు — సర్వేశం

ఎప్పుడు ఎప్పుడు అనుకొన్న ఒకటో తారీఖు రానే వచ్చింది. రోజూకంటె పెందరాళే లేచి కాలకృత్యాలు తీర్చుకొని, కాఫీవగైరా ముగించి తన రాబోయే జీతంలో తను చెయ్యబోయే ఖర్చులుగురించి ఆలోచిస్తున్నాడు సర్వేశం.

అతని నెలసరి ప్రణాళిక తయారయింది. అందులో మొదటి అంశం, అయిదు నెలలనుంచి ఏ నెలకానెల వాయిదా పడుతున్న 'కొత్తచెప్పులు' కొనటం.

సర్వేశం ఒకసారి మూలనున్న ముసలి చెప్పులవంక చూశాడు. అతనిలో సానుభూతి వెల్లివిరిసింది. "పాపం మీరు నాకోసం సంవత్సరంనుంచి శ్రమపడుతున్నారు, ఈ వాళతో మీశ్రమ తప్పుతుంది" అన్నంత అర్థంవుంది అతనిచూపుల్లో.

అయిదునిమిషాలు ఖాళీదొరికితే ఆఫీసు ఫైళ్ళమధ్య కూర్చునే సర్వేశం తీరిగ్గా కూర్చుని ఆలోచించటం చూచేసరికి సర్వేశం భార్యకి అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది — ఆవాళ ఒకటో తారీఖు అని.

"చూశారా, జాకెట్లన్నీ ఎలా చిరిగిపోయాయో" అందామె అతన్ని సమీపిస్తూ.

"ఆఁ! చూస్తూనేవున్నా" అన్నాడతను.

"ఈవాళ జీతాలొస్తాయిగా సాయంత్రం వచ్చేటప్పుడో రెండు జాకెట్లకు గుడ్డతీసుకురండి చౌకలో"

"అలాగే" తలూపాడు సర్వేశం ఎప్పటిలాగే.

మామూలుకంటే పెందరాళే భోజనం ముగించి అర గంటముందే ఆఫీసుకు చేరాడు.

ఆఫీసుకివచ్చి అరగంటయిందో లేదో హెడ్‌గుమస్తా దగ్గరనుంచి పిలుపొచ్చింది లోయర్ డివిజన్ గుమాస్తా సర్వేశానికి.

కుర్చీకి తగిలించిన కోటు బుజాలకు తగిలించి, పంచె ఎగదోసుకుంటూ "ఏం కొంప మునిగిందో కదా భగవంతుడా" అనుకుంటూ పరిగెత్తాడు సర్వేశం. హెడ్‌గుమస్తా ఏదో వ్రాసుకుంటూ సర్వేశాన్ని చూడకపోయేసరికి, ఆయన గుర్తించటం కోసం ఒకసారి సకలించాడు సర్వేశం. హెడ్‌గుమాస్తా తలపైకెత్తి "ఓ, నువ్వా సర్వేశం; కూర్చో" అంటూ కుర్చీ చూపించాడు.

సర్వేశానికి అంతా అయోమయంగావుంది పిల్చినప్పుడల్లా "కళ్ళుమూసుకుని పనిచేస్తున్నావా" అంటూ ప్రారంభించి, "ఇలా అయితే ఉద్యోగానికి తిలోదకాలివ్వాలిసి వస్తుంది జాగ్రత్త" అని ముగించే హెడ్‌గుమస్తా కూర్చోమని కుర్చీ చూపించేసరికి సర్వేశం ఆశ్చర్యాంబుధిలో అమాంతంగా మునిగిపోయాడు.

"కూర్చో సర్వేశం, ఇంకా నిలబడేవున్నావు" అని మరోసారి హెడ్‌గుమస్తా హెచ్చరించేసరికి, అది కలకాదని నిశ్చయించుకొని కూర్చున్నాడు సర్వేశం.

"చూడు సర్వేశం..." ప్రారంభించాడు హెడ్ గుమాస్తా కొంచెం సంకోచిస్తూ.

సర్వేశంగుండెల్లో రైళ్లుపరుగెత్తడం ప్రారంభించాయి "కథల్లోనూ అక్కడా చదివిన జ్ఞాపకం ఉద్యోగంనుంచి తీసి వేసి బయటికి పంపిస్తూ ఆ శుభవార్త తెలియజేసేముందు పై ఆఫీసర్లు ఇలానే ప్రవర్తించినట్టు—కొంపతీసి అలాంటిదేమీ కాదు కదా!" అనుకున్నాడు సర్వేశం.

"మరేం లేదు. ఈ వాచీచూడు" అంటూ వాచీ అందిచ్చాడు హెడ్ గుమస్తా. వాచీ అందుకొని పరీక్షించటం ప్రారంభించాడు సర్వేశం.

'ఇది అమ్మేయాలనివుంది. సరిగ్గా సంవత్సరం క్రితం నిరుడు ఈరోజుల్లోనే కొన్నాను నూటఇరవై రూపాయిలకి. ఇంతవరకూ దీనికి కానీ రిపేరు చేయించలేదు. ఏనాడూ ఒక సెకండు ఫాస్టుగాని, స్లోగాని తిరిగి ఎరుగదు" అని ఆగాడు హెడ్ గుమాస్తా.

అయితే మరి అమ్మేయటం ఎందుకో అనుకున్నాడు సర్వేశం.

"మనం కొనాలంటే కొరివి అమ్మాలంటే అడివి, అందుకని ఇది లాటరీవేద్దామని వుంది, ఏమంటావ్ ?"

"భేషుగ్గా వుందండి" అన్నాడు సర్వేశం తన ఉద్యోగానికేమీ ఉపద్రవం లేనందుకు సంతోషిస్తూ.

"దాని ఖరీదు వంద రూపాయలు కట్టాడు వాచీరిపేరర్, ఒకో టిక్కెట్టు ఐదు రూపాయలచొప్పున ఇరవై టిక్కెట్లు

పెట్టి లాటరీవేస్తాను. ఇరవై మన ఆఫీసులోనే సరిపోతాయి. అదృష్టంవుంటే నీకే రావచ్చు ఎవరు చెప్పగలం" అన్నాడు హెడ్‌గుమాస్తా నువ్వూ ఒక టిక్కట్టు కొనాలిసుమా అని నోటితో చెప్పలేక.

సర్వేశం దృష్టి ఒక్కసారి తన చెప్పులమీదపడింది. ఏదో చెప్పాలనుకున్నాడు కాని మాటలు పెగల్లేదు.

"ఇందుకే పిల్చాను ఇక వెళ్లొచ్చు" అన్నాడు హెడ్ గుమాస్తా మౌనం అంగీకారంక్రింద జమకట్టి.

"తక్కిన రోజుల్లో అయితే డబ్బు లేదంటారని ఒకటో తారీఖున వేశాడు పథకం" అనుకుంటూ బయటపడ్డాడు సర్వేశం.

ఆ మధ్యాహ్నం అయిదుగూపాయిలూ మినహాయించుకొనే యిచ్చాడు జీతం హెడ్‌గుమాస్తా సర్వేశానికి. ఆ నెలలో బాటా చెప్పులు కొనుక్కోవాలన్న సర్వేశం ఆశ మరో నెల వాయిదాపడింది. కాని లోపలమాత్రం హెడ్ గుమాస్తా వాచీ తనకు రాకుండాపోతుందా అని ఆశ పీడిస్తూనే వుంది సర్వేశాన్ని.

ఆ సాయంత్రం హెడ్ గుమాస్తా వాచీ లాటరీవేశాడు. బంట్రోతు సుబ్బన్న కొచ్చింది వాచీ. సర్వేశం తనఅదృష్టాన్ని తిట్టుకుంటూ కొంపకి చేరాడు.

ఇంట్లో అడుగుపెడ్తూనే జీతంరాళ్ళు తీసి భార్యచేతిలో పెట్టాడు. ఆమె లెక్కపెట్టి, "అయిదు తక్కువగా వుందే, కాఫీహోటలు మొహాన కొట్టివుంటారు" అంది.

అనవసరంగా అయిదురూపాయిలు పోయినందుకు ఉసూరుమంటూ వచ్చిన సర్వేశానికి అగ్గిమీద గుగ్గిలం వేసి నట్టయింది. "సంతోషించాంలే. ఇక నోరుమూసెయొచ్చు" అనే సరికి ఆమె మరి మాట్లాడలేదు.

భోజనంముగించి పడకకుర్చీకి అంటిపెట్టుకుపోయాడు సర్వేశం. ఆ మర్నాడు తేవలసిన అపరాలూ అవీ ఏకరువు పెడ్తూ భార్య పక్కనచేరింది. సర్వేశం నెమ్మదిగా ఊ కొడు తున్నాడు. అదే మంచి సమయం అనుకుందామె "మీకు అంటే కోపంగాని అనవసరంగా అయిదు రూపాయలు తగ లెయ్యటా దేనికండీ" ? సర్వేశం పలకలేదు.

"అసలు ఏంచేశారండీ ?" అడిగిందామె గోముగా.

చెప్పక తప్పదనుకున్నాడు సర్వేశం. అంతా పూస గుచ్చినట్లు చెప్పాడు.

"అయ్యో ! రాము, ఇలాంటి లాటరీలు మనకు అచ్చి రావండీ ఇదివరకెన్ని నెయ్యలేదు. అన్నీ అయ్యాయి-సున్న."

సర్వేశం మాట్లాడలేదు.

"మాశారూ మనవీధి చివరి సుబ్బమ్మపిన్నిగారి రెండో అమ్మాయి పెళ్ళి ఖాయమైంది. ఇరవై య్యో తారీఖున పెళ్ళి" అందామె టాపిక్ అమాంతంగా మార్చేస్తూ.

"ఊ! అయితే ?..." అన్నాడు సర్వేశం హఠాత్తుగా ఆమె 'గేర్' మార్చేసరికి ఉలిక్కిపడి.

"అంతేకెండి, నేను రోజూ వాగటమేగాని పిల్లదాని పెళ్ళివిషయం మీాకు పట్టకుండా వుంది" అంటూ ఏడుపు ముఖం పెట్టిం దామె.

"ఏమండీ మాట్లాడరేం ?"

"అబ్బబ్బ ! వుండు ఈవాళయినా సుఖంగా నిద్ర పోనియ్యి" అంటూ వెళ్ళి మంచంమీాద వాలిపోయాడు. సర్వేశం పడుకొన్నాడన్న మాటేకాని బుర్రమాత్రం ఆలోచిస్తూనే వుంది. చిట్టికి పద్దెనిమిదో ఏడు వెళ్ళిపోయిందని అతనికి గుర్తొచ్చింది. ఐదు రూపాయలు పెట్టి చెప్పులు కొనుక్కోటానికి అయిదు నెలలనుంచి వాయిదా వేస్తున్న లోయర్ డివిజన్ గుమాస్తా సర్వేశానికి కూతురు పెళ్ళి ఎలా చేయుటమో అర్థంకాలేదు. కాని అలసిపోయిన శరీరంకలత నిద్రలోపడింది.

♦ ♦ ♦ ♦ ♦ ♦

"లాటరీ సార్, లక్కీఛాన్స్ లాటరీ"

"పోవోయ్! ఫో! అయిన ఐదురూపాయలూ ఆ హెడ్ గుమాస్తా కాజేశాడు, ఇకనువ్వొకడివా"

"ఇది కొత్తరకం సార్ ఇంతవరకూ మీారు కనీ వినీ ఎరుగని లాటరీ"

"అంటే ?"

"ఈ లాటరీలో టిక్కెట్టు ఖరీదు రూపాయి మాత్రమే ఇలాంటి టిక్కెట్టులు నాలుగువేలు అమ్మడనగానే లాటరీ వేస్తాం. ఎరికో వస్తుంది"

"ఏమిటది?"

"వరుడు"

"వరుడా!"

"అవునుసార్, యువకుడు, అందగాడు, బి.ఎ. పాసయి నవాడు. అదృష్టంవుంటే మీకే రావచ్చు. మీ అమ్మాయి పెళ్ళిసమస్య తేలిపోతుంది చూస్తే లేదుసార్; కాస్తేనే వుంది"

"అయితే నాకో టిక్కెట్టు ఇయ్యి"

* * * * *

"సర్వేశంగారూ!"

"ఎవరూ?"

"నేనుసార్, లాటరీయునిషిని మీ టిక్కెట్టు 2829 గెలిచింది. ఇదిగో వరుడు"

"ఆ!...నకు లాటరీ వచ్చిందా!... అమ్మయ్య మా అమ్మాయి పెళ్ళయిపోయినట్టే?"

"ఆ...అయిపోతుంది; ఎనిమిదయినా లేవకుండా పడు కోండి మీరు, అమ్మాయిపెళ్ళి దానంతటదే అయిపోతుంది లేవండి" అని భార్య లేపేసరికి ఉలిక్కిపడి లేచాడు సర్వేశం కళ్లు నులుముకొంటూ. చిరిగిపోయిన జాకెట్టుతో భార్యను చూశాడు. చూడలేక ముఖం పక్కకుతిప్పుకొన్నాడు. మూలనున్న ముసలి చెప్పులు స్వాగతంయిచ్చాయి. "ఓయి భగవంతుడా" అనుకొంటూ గోడమీది దేవుడిఫొటో చూచే సరికి అక్కడ కాలెండర్‌లో ఒకటోతారీఖు వెక్కిరించింది. కళ్లుమూసుకున్నాడు బరువుగా నిట్టూరుస్తూ—లోయర్ డివి జన్ గుమాస్తా సర్వేశం.

---

# నవభారతంలో ఉద్యోగపర్వం

మానాన్న స్కూలుఫైనల్ కూడా పాసుకాలేదు. అయితేనేం? తాలూకాగుమాస్తా. నేను బి. ఏ. పాసయ్యాను. కాని నాకు ఆ గుమాస్తా ఉద్యోగంకూడా దొరకలేదు. కవిత్వం చెప్పబోయి విమర్శలో పడ్డట్టు, గుమాస్తాగిరి కూడా కరువయ్యేసరికి ఇన్సూరెన్సులోకి దిగాను.

ఇన్సూరెన్సు పనిమీద ఆ గ్రామం వెళ్ళవలసివచ్చింది. గ్రామం ప్రవేశించగానే 'కనకమహాలక్ష్మి' కాఫీహోటల్ కనిపించేసరికి నా ప్రాణాలు కుదుటబడ్డాయి గ్రామమునసబుగారింటికివెళ్ళి నన్ను నేను ఎరుక పరుచుకొనేసరికి; ఆయన "నువ్వా! సర్వేశం! ఎప్పుడో ఇంతప్పుడు చూశాను. జ్ఞాపకమేలేదు. ఉద్యోగం చేస్తున్నావలాగా? ఎంతిస్తారేంటి? అమ్మానాన్నా కులాసాయేనా? తాతయ్యవంట్లో ఆరోగ్యంగా వుంటోందా? ఆమధ్య మీ వూరొచ్చానులే; తాతయ్య వంట్లో కులాసా లేదన్నాడు" అంటూ ఆయనో ప్రశ్నలవర్షం కురిపించాడు. ఆయన ప్రశ్నలకు తాపీగా సమాధానాలు చెప్పాను. "లేమరి; పొద్దుట ఎప్పుడు తాగావో కాఫీనీళ్లు" అని ఆయన అనేసరికి నా సమాధానాలకు తృప్తిపడ్డాడని అనుకొని భోజనానికి లేచాను.

ఆత్మారాముణ్ణి సంతుష్టి పరిచేసరికి, నిద్రాదేవి ఆవహించింది. సాయంత్రం మూడుగంటలకు కాని వదల్లేదు ఆ

మహాతల్లి. లేవి ఇన్ని కాఫీనీళ్లు పొట్టలో పోసుకొని వచ్చిన పనేమిటో చూసుకొనేందుకు బయలుదేరాను.

పని ముగించుకొని తిరుగుముఖం పట్టేసరికి సంధ్యా సమయమయింది. మంద మందలుగా వస్తూన్న గొడ్డుగోదలను తప్పించుకొంటూ, ఆకాశానికి చిన్న మేఘంలా లేస్తున్న గోధూళినుంచి నాశికను చేతిరుమాలతో సంరక్షించుకొంటూ, చిన్నచిన్న మట్టిగడ్డలు కాబూలీషూలో దూరి గల్లంతుచేస్తూంటే నెమ్మదిగా నడకసాగిస్తూ, ఆసందులుపు తిరిగి గ్రామాలనుం సమీపించాను. అంటే; ఆ గ్రామం రాచబాటమీదకి అన్నమాట! మరో రెండడుగులు వేసేసరికి 'జనతా ఫ్యాన్సీస్టోర్సు' కనిపించింది. ఇంత చిన్నగ్రామంలో ఫ్యాన్సీస్టోర్సుకూడానా అనుకొంటూ ముందుకు నడక సాగించాను ఆస్టోర్సు మీదుగా.

ఇంతలో "గిల్లెట్ బ్లేడులు లేవండీ, సెవనోక్లాక్ ఇవ్వమన్నారా?" అన్నమాటలు వినబడే సరికి నాకాళ్ళు ముందుకు నడవనన్నాయి. ఠకీమని ఆగి అటు చూడక తప్ప లేదు తీరా చూసేసరిక స్టోర్సులో సరుకు అమ్ముతున్నవాడు సుబ్బారావు. సుబ్బారావు నేనూ బి. ఏలో క్లాసుమెట్సుం, "గిల్లెట్ బ్లేడులున్నాయాండి" అంటూ స్టోర్సులోకి వెళ్లాను.

నన్ను చూడకుండా 'లేవండీ, సెవనోక్లాక్ ఇమ్మన్నారా?' అని నావంక చూశాడు సుబ్బారావు.

"ఓరి! నువ్వటరా, ఏమిటిసంగతి ఇలా ప్రత్యక్ష మయ్యావ్?" అన్నాడు.

"అది సరేలే; ఈ అవతారం ఏమిటిరా?"

"ఏంచెయ్యమన్నావురా, మన బి. ఎ. డిగ్రీ కసిసం నాలిక గీసుకోటానికూడా పనికిరాకుండా పోయింది. ఇంతకీ మనం ఏంచేస్తున్నట్లు?" అన్నాడు వాడు నే వచ్చిన కారణం కూడా చెప్పాను.

"వాళ్ళబ్బాయి నా స్నేహితుడే, వాడిద్వారా ప్రయత్నిద్దాం. పదివేలకు తక్కువ కాకుండా చేస్తాములే" అన్నాడు.

"అవును కానీ, మీ మామయ్య తహశిల్దారు కదా ఏ తాలూకాలో అన్నా ఉద్యోగం చూడలేకపోయావ్, ఇంతచదువూ చదివి..."

"ఏం లాభంలేదురా బ్రదర్, ఈ రోజుల్లో బంట్రోతు వుద్యోగానికికూడా మంత్రుల సిఫార్సు కావాలి"

"వచ్చినట్టుంది మంత్రులే చేతిలో వుంటే వుద్యోగం ఏంకర్మం వూళ్ళే ఏలుదుం" అన్నాను.

"అందుకనే మనచేతిలో మంత్రుల్లేరు. తాలూకాఫీసులో అటెండర్ ఉద్యోగం దొరకలేదు మంత్రిగారి సిఫారసుతో తెలుసా? నువ్వేదో వూళ్ళేల్తానంటున్నావ్?" అన్నాడు సుబ్బారావు. నే నాశ్చర్యపోయాను మంత్రిసిఫారసుతో అటెండర్ వుద్యోగం దొరకలేదంటే!

"నేనన్నమ్మనురా?" అనేశాను.

"అయితే విను" అంటూ ప్రారంభించాడు సుబ్బారావు. "సరిగ్గా సంవత్సరం క్రిందట ఇదే రోజుల్లో నేను మామయ్య గారింటికి వెళ్ళాను; ఇంట్లో మా నాన్న ఉద్యోగం లేదన్న పోరు కొన్నాళ్ళయినా తప్పుతుందేమోనని. అక్కడ పగలు ఎలాగో గడిపేవాణ్ణి, సాయత్రం మామయ్యతో కలసి క్లబ్బుకి వెళ్తూండేవాణ్ణి"

"ఓ రోజున మామయ్యా నేనూ క్లబ్బుకి వెళ్ళాం. వేపచెట్టుకింద సింహాసనాలమీద కూర్చుని క్లబ్బు మెంబర్లు బాతాఖానీ కొడుతున్నారు. "గుడ్ మార్నింగ్ సార్! రెండు రోజులనుంచి దర్శనాలే లేవు" అని క్లబ్బుబంట్రోతు ఎవరినో పలకరిస్తూంటే అంతా అటు తిరిగాం ఇంతలో ఆయన మేం కూర్చున్నచోటుకి రానేవచ్చాడు. "గుడ్ మార్నింగ్!" అంటూ కూర్చున్నాడాయన.

"రెండు రోజులునుంచి రావటంలేదు" అన్నాడొకాయన.

ఆఁ! ఏముంది. మా ఆఫీసులో ఓ ఉద్యోగం ఖాళీ అయింది. అది భర్తీచేసేసరికి తలప్రాణం తోకకొచ్చింది" అన్నాడా పెద్దమనిషి.

"వెనకటికి ఒకాయన పంచదార తిని నోరంతా కడుక్కున్నాట్ట!... ఉద్యోగం ఖాళీ అయిందట, కోస్తే తెగాలి!" అన్నాడొక మెంబరు.

"వేలకొద్దీజనం ఉద్యోగాలులేక సతమతమైపోతూంటే, సంవత్సరానికి పదిహేనిమిది లక్షలమంది నిరుద్యోగులు మాన్యుఫేక్చర్ అవుతున్నారని పత్రికలవాళ్ళు తాటికాయలంత అక్షరాలతో పేపర్లలో ప్రచురిస్తూన్న ఈరోజుల్లో, అందులోనూ గవర్నమెంటు వుద్యోగానికి ఒక్కడూ దొరక లేదూ!" అంటూ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు మరో మెంబరు.

"ఆఁ! అక్కడేం వచ్చింది చిక్కు, ఒకడూ ఇద్దరూ అయితే బాధలేదు, వేలమంది తయారవుతుంటే - ఏం చెయ్యటం?" అన్నాడా పెద్దమనిషి.

"ఎవడికో ఓ ఆకాశరామన్నకు పారేస్తే పోయేదానికి పెద్ద బ్రహ్మకార్యంగా చెబుతున్నావేమిటి నువ్వు" అన్నాడో సభ్యుడు.

"నే చెప్పేది పూర్తిగా వింటే నే పడ్డ అవస్థ మీకే తెలుస్తుంది" అంటూ చెప్పటం ప్రారంభించాడా పెద్దమనిషి.

"నెలక్రిందటే అందరికీ తెలిసిపోయింది మా ఆఫీసులో అటెండరు రిటైరు అవుతాడని: ఇక చూడండి, అప్పటినుంచీ ప్రారంభమయ్యాయి దరఖాస్తులు. రెండువందల ఎనభైమంది అప్లయిచేసారు. ఈ ముండమోపి అటెండరు వుద్యోగానికి ఒక మంత్రి సిఫారసు తెచ్చాడు ఒక ఘనుడు. ఛైర్మన్ సిఫారసు మరొకడు. జిల్లాకలెక్టర్‌గారి అల్లుడు మేనత్త కొడుకు ఒకడు, ఇలా అంతా గెజిటెడ్ ఆఫీసర్ రేంకుకి తక్కువకాని ఆఫీసర్ల దగ్గరనుంచి సిఫార్సులు తెచ్చారు.

తులు తలా ఒకడిని తీసుకొచ్చారు. అందరికీ తలూపి పంపించేశాను. "ఇప్పుడు చెప్పండి-ఎవరికీ వుద్యోగం ఇవ్వాలో?" అన్నాడా పెద్దమనిషి.

మెంబర్లంతా ముఖాలు చూసుకొన్నారు. కొంచెం ఆగి కొందరు మంత్రిగారి సిఫారసు తెచ్చిన వ్యక్తికి ఇవ్వాలన్నారు కొందరు గ్రాడ్యుయేట్ కి ఇవ్వాలన్నారు.

'ఇంతకీ ఎవరికిచ్చావ్? ఏదో వేస్తావ్ చాణక్యతంత్రం నువ్వా నాయనా, దేవాంతకుడివి" అన్నాడొక మెంబరు. ఆయన నవ్వి ఇలా అన్నాడు. "ఉద్యోగం ఒకరికిస్తే మరొకరికి కోపతాపాలు కలుగవచ్చు. అందుచేత దరఖాస్తు పెట్టిన ఏ ఒక్కరికీ ఇవ్వకుండా పూర్తి చెయ్యాలి, దరఖాస్తు పెట్టనివాడికి ఇవ్వటం అనుచితం ఎలారా భగవంతుడా అని రెండురోజులు ఆలోచించాను "స్త్రీసాహసం" సినిమా జ్ఞాపకం వచ్చింది-గోడమీద వాల్ పోస్టర్ చూశాక. పెళ్ళికాకుండా రాకుమారి పిల్లాడిని ఎలా కన్నదో గుర్తు వచ్చేసరికి, ఇలాంటి సమస్యలు ఏదో గారడీ చెయ్యకపోతే పరిష్కారం కావని తేలింది. ఈవేళ ఇంటికి వెళ్ళి ఇంత కాఫీ ఒక్క సిగరెట్ దమ్ము లాగేసరికి ఆలోచన తట్టింది. ఆలోచనంటే సామాన్యమా? బ్రహ్మాండమయిన పథకం! వెంటనే మళ్ళీ ఆఫీసుకు వెళ్ళి ఉద్యోగం వేసేసి ఆర్డరుమీద సంతకంపెట్టి ఇలా వచ్చాను.

"ఇంతకీ ఎవరికిచ్చారు?" అన్నారు మెంబర్లు.

"ఈ ఉద్యోగం కొత్తవాళ్ళకి ఇవ్వటాని వీల్లేదు. ఇది ఆఫీసు వాళ్ళకే అని చెప్పి మా ఆఫీసు బంట్రోతును అటెండ

రుగా వేసి, బంట్రోతు నౌకరీ ఖాళీ చూపించాను. ఆ దెబ్బతో అంతా జారుకున్నారు. కానీ, బి.ఏ. అతనుమాత్రం వదల్లేదు, అదయినా ఇవ్వమన్నాడు. నేనూ బి.ఏ. నేకావటం వలన మీకీ వుద్యోగం ఇవ్వటానికి నాకు మనస్కరించటం లేదని అతనికి చెప్పాను ఆ మాటలకి అతను కళ్ళనీళ్లు పెట్టుకొని "అంత అభిమానంవుంటే ముందీ వుద్యోగం ఇవ్వండి" అన్నాడు. వెంటనే అతనికి అపాయింట్ మెంట్ ఆర్డరు ఇచ్చి యిలా వచ్చాను.'' అంటూ ఆగా డాయన.

తక్కిన వాళ్ళంతా నోళ్లు తెరుచుకుని అలా చూస్తూ వుండి పోయారు.'' అంటూ ముగించాడు సుబ్బారావు.



# లోకం పోకడ

ఆమర్నాడు వినాయక చవితి. అయిదు గంటల బండిలో మా బావమరిది సుందరం దిగాడు. వాల్తేరు వర్సిటీలో బి. ఎ. ఆనర్స్ మూడో సంవత్సరం వెలగబెడ్తున్నాడు. చిన్న చిన్న పండుగలకు అంటే వినాయకచవితి, దసరా వగైరాలకు మా ఇంటికిరావటం; సంక్రాంతికి, వేసవికి పుట్టింటికి (స్వగ్రామం) కోనసీమ వెళ్ళటం వాడికి అలవాటయింది. మాటి మాటికి ఆ రావణాసురుడి లంకలోకి (కోనసీమ) దూకటం అంటే వాడికి పరమచికాకు. ఒక్క విమానయానం మినహా అన్ని యానాలు చెయ్యాల్సిందే ఆ కోనసీమలో కాలు పెట్టాలంటే! రాత్రి ఎనిమిది గంటలకు మెయిలెక్కి పడుకొంటే తెల్లవారేసరికి మూడువందలమైళ్ళు సునాయాసంగా దాటి మద్రాసు మహానగరంలో వాలొచ్చు. కానీ ఈ కోనసీమ ప్రయాణానికి ఫక్తు ఒక పగలంతా కావాల్సిందే! ఎటు చూసినా నీళ్ళగా మరి!

వాడికి మా వూరు రావటం మహావీలు. చక్కగా మెయిల్ లైనులో వుంది. అక్కడ ఎక్కితే ఇక్కడ దిగటం. వాడు రావటం నాకూ ఇష్టమే, కాలం సరదాగా కబుర్లతో నెట్టెయ్యొచ్చు. కానీ వాడు ఒట్టి చలిపిరకం. పాతకాలం సంగతులు మర్చిపోకుండా తవ్వి బయటకుతీస్తుంటాడు. అదొక్కటే వాడితో వచ్చిన తంటా అల్లా.

అప్పటికి వాడొచ్చి అరగంటయినా తమ్ముణ్ణి చూసుకొని మా శ్రీమతికి సంబరం వదల్లేదు. ఫస్టా అరగంట వాడి యోగక్షేమాలడిగి తెలుసుకొంది. పావుగంటనుంచి దొడ్డి గుమ్మంలో అరుస్తున్న చాకలి సూరమ్మ కేకలు మా శ్రీమతి కర్ణపుటాలకి సోకితేగా! పాపం విసిగిపోయిందిలాగుంది—ఆ బట్టలు తెచ్చి వీధి గుమ్మంలో పెట్టి "నోరు పడిపోయింది పిలవలేక, ఏం చేస్తున్నారమ్మా?" అంది చాకలిది.

"కనపట్టం లేదూటే వెధ్దముఖమా! మా తమ్ముడొచ్చాడు, వాల్తేరులో ఆనర్సు చదువుతున్నాడు. ఈ ఏడాదితో అయిపోతుంది, కాలేజీ లెక్చరర్ అయిపోతాడు" అంది మా శ్రీమతి. (సొంతడబ్బా)!

చాకలి సూరమ్మ ఓసారి సుందరం వదనారవిందం కేసి వర్ణనాతీతంగా చూసి వంటినిండా చెంగు తీసుకొంది. కాబోయే లెక్చరర్ వేషంలో ఇప్పటినుంచీ ట్రియినింగ్ అవుతున్న సుందరాన్ని చూస్తే చాకలి సూరమ్మకు కొంచెం సిగ్గుపడటం సబబుగా తోచింది.

"అప్పటినుంచీ ఇదేనా మీ చాకలిది!" అన్నాడు సుందరం వస్తూన్న నవ్వు ఆపుకుంటూ.

"ఆఁ! ఇదే వదిలించుకో లేకుండా వున్నాం" అంది శ్రీమతి నవ్వుతూ నా వైపు చూస్తూ; అక్కా తమ్ముళ్ళిద్దరూ నావైపు చూసి ఒకటే నవ్వటం. ఏమాట కామాటే చెప్పుకోవాలి. నా ముఖం దమ్మిడీకాసంతయింది. నే ముందే చెప్పా

నాయిరి వీడు తిన్నగా వుండక పాతకాలపుస్మృతులు బయటికి తెస్తాడని. లేకపోతే ఎప్పటిసంగతి ? అయిదేళ్ళక్రితం గొడవ ! ఇప్పుడెందుకు చెప్పండి ? పోనీ జ్ఞాపకంవస్తే మాత్రం మన స్సులో వుంచుకోవాలి కాని బయటికి కక్కి ఎదుటివాళ్ళను బాధపెట్టటం మాత్రం ఏమంత సమంజసంగా వుంది? "అప్పటినుంచీ ఈ చాకలిదేనా!" అంటాడా—

♦ ♦ ♦ ♦ ♦ ♦

అవి మా శ్రీమతి కొత్తకాపురం రోజులు. రామచంద్ర రావు పేటలో ఓడాబాఇల్లు అద్దెకు తీసుకుని బోర్డుకట్టాను. మా కొత్త కాపురం, నా ప్రాక్టీస్ చూద్దామని నా మిత్రుడు సుబ్బారావొచ్చాడు గుంటూరునుంచి. ఇక్కడ సుబ్బారావుని మీకు పరిచయం చెయ్యాల్సిన అవసరం ఎంతైనా వుంది.

ఇప్పటికీ సుబ్బారావుకి ఆ బిరుదు వుందో లేదో ఇప్పుడు నాకైతే తెలియదుకాని, మేం కాలేజీలో చదివేరోజుల్లో మాత్రం అంతా సుబ్బారావుని "సోషల్ రిఫార్మర్" అంటుం డేవారు. క్లాసులో ఏదైనా ప్రశ్నలు వేసేటప్పుడు లెక్చరర్లు కూడా సుబ్బారావుని "ఈ ప్రశ్నకు సమాధానం మన సోషల్‌రిఫార్మర్ చెబుతాడు" అంటుండే వారు. కొన్నాళ్ళకి సుబ్బారావుకి తలితండ్రులు బియ్యంలో వ్రాసిపెట్టిన పేరు పోయి "సోషల్ రిఫార్మర్"అన్న పేరు ఖాయమై వూరుకొంది.

సుబ్బారావు, నేనూ ఒకేరూములో వుండేవాళ్ళం. మొదట్లో నాకు అతను, అతనికి నేను ఏమాత్రం పూర్వ

పరిచయం లేనివాళ్ళమే అయినా, కాలేజీవదలి విడిపోయేసరికి ఒకరినొకరు "ఏడిశావులే! నీ తలకాయలే! నీ మొహంలే!" అనుకొనేంత సన్నిహితుల మయ్యాం. అంతర్జాతీయవ్యక్తులను కూడా ఏడిశావులే! నీ మొహంలే! అనగలిగేటంత దగ్గరబంధువులు, స్నేహితులు వుంటారు అంటాడు కుటుంబరావు. సుబ్బారావు కూడా ఒక అంతార్జాతీయవ్యక్తి కాక పోడని, అప్పుడు ఆ ఖ్యాతి నాకు వస్తుందని అప్పట్లో నాకు గంపంత ఆశవుండేది. సుబ్బారావు లెక్చర్లు వింటూవుంటే నా కలా అనిపించేంది

ఆరోజుల్లో, అంటే మేం ఏ. వి. యన్. కళాశాలలో చదువుకొనే రోజుల్లో, స్త్రీస్వాతంత్ర్యము" గురించి బల్లలు బద్దలవుతుండేవి. అప్పట్లో స్త్రీ స్వాతంత్ర్య సినాదాలు లేవదీసిన వాళ్ళలో సుబ్బారావొకడు. కాలేజీ వార్షికోత్సవంలో "స్త్రీవిద్య" అన్నవిషయంమీద దిక్కులు పిక్కటిల్లేలా మాట్లాడి ఫస్టుప్రయిజ్ సంపాదించాడు. మహిళా సంఘం వార్షికోత్సవంలో "స్త్రీ స్వాతంత్ర్యం" గురించి మాట్లాడమని మహిళాసంఘంవారు కోరగా మనవాడు ఫస్టు గంటన్నర గుక్కతిప్పకోకుండా ఉపన్యసించి మహిళాసంఘం కృతజ్ఞతాపూర్వక అభినందనలు అందుకున్నాడన్న విషయం ఆనాడు అందరూ ఎరిగిన వెగటు విషయమే.

ఆవాళ సాయంత్రం సుబ్బారావూ నేనూ అలా వెళ్ళి వద్దామని బయలుదేరాం. రవీంద్రలో కాఫీ సేవించి పంపుల

చెరువుకి బయలుదేరాం. పచ్చగా వున్న చోట ఆసీనులయ్యాం. ఒకవైపున పట్టణ వాతావరణం, మరోవైపు పల్లెవాతావరణం చూడ ముచ్చటగా వుంది. అయిదుగంటలబండి విజయవాడ వెళుతోంది. ఇటుచూశాం—చూపు ఆనేంతవరకూ పచ్చని వరిచేలు కనిపించాయి. అక్కడక్కడా వున్న దిబ్బలమీద నిద్రగన్నేరుచెట్లమీంచి కోయిల గుప్తరాగంలో 'కూ! కూ!' అంటోంది. పశ్చిమాద్రిని సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆరక్తారుణ కాంతిలో చెరువులో నీళ్ళన్నీ బంగారు పూత పూయబడ్డాయి. ఆ ఎట్టిని సంజెలో పచ్చని వరిచేల మధ్య నుంచి పల్లెసీమ కన్నెపడుచులు గడ్డిబుట్టలతో వయ్యారంగా నడచిపోతున్నారు. ఆ నడకనే హంసనడకంటారని, అవి అజంతా శిల్పాలని సుబ్బారావు; కాదు, రామవర్మ వెల్లూరు సౌందర్య ప్రతిమలు ప్రాణం పోసుకు వచ్చాయని నేనూ వాదించుకొని కట్టకడపటికి సృష్టికర్తను ప్రస్తుతిచేయకుండా వుండలేకపోయాం.

తరువాత సుబ్బారావు ప్రారంభించాడు. "స్త్రీవిద్య" "స్త్రీ స్వాతంత్ర్యము" "సాంఘిక దురాచారములు" గురించి ఏమిటేమిటో ఉపన్యాస ధోరణిలో తానొక స్టేజీమీద వుపన్యసిస్తున్నట్లు వూహించుకొని చెబుతున్నాడు సుబ్బారావు.

"ఏమోరా! అబ్బీ! స్త్రీలకు నువ్వు కావాలనేంత స్వేచ్ఛకూడదు. స్త్రీకి విద్యకూడా స్త్రీని స్త్రీగామాత్రం వుంచేంతవుంటే చాలు" అన్నాను

"చూడు మిష్టర్ ఈ ఆటం యుగంలోకూడా నీవంటి స్వార్థమానవులుండబట్టే ప్రపంచం ఇలా మాడిపోతోంది. నువ్వింకా స్త్రీ, యంత్రం అనే ధోరణిలోనే వున్నావు, స్త్రీ కేవలం అబలే అనుకోకు సమయంవస్తే సబలే! నీలాంటి వాళ్లు అడపాతడపా వుంటారనే ప్రభుత్వం కొత్త బిల్లు ప్రవేశ పెడ్తున్నదని తెలుసా?" అంటూ తనో నిస్వార్థపరుడిలా, తానేదో సర్వసమానత్వంకోసం అలమటిస్తున్నట్టూ నే నో నరరూపరాక్షసుడయినట్టు ఓ చిన్న వుపన్యాసం దంచాడు. వాడి కది మొదటినుంచీ అలవాటే.

"బిల్లులూ శాసనాలూ ఏం చేస్తాయిరా బ్రదర్, హృదయపరివర్తన రావాలిరా!" అన్నాను నేను, వాడి నోటికి తాళంవేద్దామని. వాడేం మాట్లాడలేదు.

'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకహాః' అన్నాడట కాళిదాసు. జరిగిపోయిన ప్రపంచ యుద్ధాలకి కారణం కైకలే అని కొందరు బుద్ధిమంతులు అనుకొంటున్నారట ఎంతవరకూ నిజంరా?" అన్నాను.

"అక్షరాలా నిజం. పదహారణాల పరమనిజం, స్త్రీ ఆదిశక్తిస్వరూపిణి. క్షణంలో ప్రళయంసృష్టిస్తుంది. క్షణంలో ప్రణయం సృష్టిస్తుంది" అన్నాడు సుబ్బారావు.

"ఆ గరళకంఠుడు మనమీద అపారమయిన దయదలచి ఆ మూడో కన్ను కాస్తా తనదగ్గరే అట్టేపెట్టుకున్నాడు కాని లేకపోతే ఆ త్రినేత్రంతెరచి ఈపాటికి మనల్ని భస్మం చేసేవారే నంటావు" అన్నాను నవ్వుతూ.

"నువ్వెప్పుడూ స్త్రీలకు స్వాతంత్ర్యంలేదని ఏడుస్తావ్, నేనో చిన్న సంఘటన చెబుతా విను. అమాంతంగా మా కొంపలో ఓసారి యుద్ధంవచ్చింది. అసలు జరిగిం దేమంటే, ఇంట్లో చెప్పకుండా సినిమాకు వుడాయించాను. ఇంటికి వచ్చే సరికి శ్రీమతి కైకరూపం ధరించింది; ఏ మందరసహాయం అక్కరలేకుండానే! పూర్వం నే నేమీ యుద్ధాలూ చెయ్య లేదు; ఆమె కేమీ వరాలూ ప్రసాదించలేదు కనుకఅమ్మయ్య అనుకొని ముసుగు తన్నాను ఆ మర్నాడు వార్ డిక్లేర్ అయింది. బాంబులు ఎక్కడ ఏ సమయంలో పడేదీ నిర్ధారణ చెయ్యలేంచూడు— బాంబులు పడ్తాయి అనుకున్నంతసేపు పట్టలేదు; బాంబులు పడ్డాయి. చెంబులు, తపేలాలు, గిన్నెలూ ఒకటేమిటీ! ధన్! ధన్! మని ఒకటేమోత. చివరకు చచ్చిచెడి చాయంగల విన్నపములై యుద్ధం అంతరించి శాంతి అంకురించేసరికి పాతికరూకల ఆయింట్ మెంట్ అయింది."

"ఎందుకురోయ్!!" అన్నాడు సుబ్బారావు మందహాసాలంకృత ముఖారవిందుడై.

వాడ్ని చూసేసరికి నాలో ఏదో చెప్పరాని బాధ ప్రవేశించినా చివరకు చెప్పక తప్పలేదు.

"ఇరవై రూపాయిలు చీరకు, అయిదు వార్ లో వూండ్ అయిన పాత్రలను మాటు చేయించటానికీను."

"అవునుమరి అంటూ వాడేదో వాగబోయాడు కాని వాడ్నిఆపి నేనే అందుకున్నాను: "ఏమిటవును! నీ మొహం

అవును. స్త్రీలు కావలసినంత స్వేచ్ఛా స్వాతంత్ర్యములు వుంచుకొనే లేవని అఘోరిస్తున్నారు—పురుషులు మహా స్వతంత్రంగా బతుకుతున్నట్లు నిర్వీగుతున్నారు" అన్నాను స్వీయగృహంలో శ్రీమతి స్వాతంత్ర్యము పురస్కరించుకొని.

"నువ్వు చెప్పింది కొంతవరకు నిజమేకాని, అది అందరకూ వర్తించదు" అన్నాడు సుబ్బారావు కాసేపాగి.

ఆ తరువాత స్త్రీలగురించి చాలామాట్లాడాడు. స్త్రీలను స్వేచ్ఛగా వదలెయ్యాలన్నాడు. అనవసరమయిన అనుమానాలు కూడదన్నాడు, వాళ్ళకి ఇంగితజ్ఞానం వుంటుందన్న విషయం జ్ఞాపకముంచుకోవాలన్నాడు, స్త్రీలకు రాజకీయ, సాంఘిక, ఆర్థికహక్కులు, బాధ్యతలు పురుషులతో పాటు సమానంగా వుండాలన్నాడు. ఇంకా ఏమిటో చెప్పాకు పోయాడు. పైరుగాలి పీలుస్తూ సుషుప్తావస్థలో పడ్డ నాకు వాడి ఉపన్యాసాలు చెవికెక్క లేదు. మసకమసకగా చీకటి ఆవరించటం ప్రారంభించే సరికి చొక్కాలు దులుపుకుంటూ బయలుదేరాం కొంపకి.

భోజనాలు ముగించుకొని వీధిలో ఈజీచెయిర్సులో కూర్చుని లోకాభిరామాయణంలో పడ్డాం. ఇంతలో మా చాకలిది సూరమ్మ నురగలు కక్కుకుంటూ వచ్చింది. లోపలికి వెళ్ళి మా శ్రీమతితో ఏడుస్తూ ఏదో చెప్పుకొంది. చివరికి తేలిన సంగతి ఏమంటే, దాని మొగుడు బాగా తాగివచ్చాడట; తంతాను పొడుస్తాను అంటూ మీదమీదకి వస్తుంటే భయపడి పారిపోయి వచ్చిందట. దాని ఇల్లు మా ఇంటికి

దగ్గరే. ఇంత అన్నం పెట్టి దాన్ని ఇంట్లోనే పడుకోమంది శ్రీమతి.

ఇక్కడ సూరమ్మ గురించి కొంచెం చెప్పాల్సివుంటుంది. ఆవాళ ప్రొద్దుట పుతుకుబట్టలు పట్టుకెళుతుండగా సుబ్బారావు దాన్ని చూశాడు. అది చాకలి అని నమ్మలేక, నమ్మి "బ్రహ్మదేవుడు నిద్రపోతూ సృష్టించి వుంటాడురా! లేకపోతే ఇంత అందమయిన దాన్ని ఈ కులంలో పుట్టిస్తాడా!" అన్నాడు.

అందమయినది ఆ కులంలో ఎందుకు పుట్టకూడదో నాకు అర్థంకాలేదు. అందానికికూడా కులమత భేదాలు, పట్టింపులూ వుంటాయి కాబోలు! కాని సూరమ్మ అందకత్తె అని ఎవరయినా వొప్పుకోవాల్సిందే! ఎందుచేతనంటే సుబ్బారావొక్కడే కాదు దాన్ని పొగడటం; అరవై య్యోపడిలో పడ్డ మా మామగారు సయితం ఆ మాటే అన్నాడు. ఇక మా గుమాస్తాసంగతి వేరేచెప్పాలా మాంచి Photogenic Face అంటాడు. ఇంతటి మన్ననలకు గురిఅయిన సూరమ్మ తాగుబోతు భర్తపుణ్యమాఅని పతివ్రితగా చెలామణీ అయిపోతోంది.

నేనూ సుబ్బారావూ వీధిగదిలో పడుకున్నాం. శ్రీమతి పక్కగదిలో పడుకొంది. పోతే సూరమ్మ వీధివసారాలో పడుకొంది. రాత్రి సుమారు రెండు గంటలవేళ "దొంగ! దొంగ!" అన్న కేకలు విని లేచాను. నేను లేచిచూసే సరికి సుబ్బారావు పక్కమీద లేడు. టార్చివేసుకుంటూ బయటికి

వచ్చేసరికి సుబ్బారావు కంగారుగా ఎదురయ్యాడు. నన్ను చూసి నిర్ఘాంతపోయి, వెళ్ళి మంచంమీద పడుకొని ముసుగెట్టాడు. అసలు విషయం తెలియక తికమక పడుతూ, వాణ్ణి అడిగి తెలుసుకుందామని లోపలికి రెండడుగులు వేసేసరికి, శ్రీమతి, సూరమ్మ, ఇంకా ఇరుగుపొరుగువాళ్లు నా గదిలో ప్రవేశించారు.

"ఈ గదిలోకే వెళ్లాడండి" అంటున్నారు వాళ్లు.

"ఎవరు?" అన్నా.

"దొంగ"

"దొంగ! ఎవరూ ఇక్కడికి రాందే?"

కర్రలు వేసుకొచ్చిన పొరుగువాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. వాళ్ళనవ్వు ఎందుకో నాకు ఆ మర్నాటికి కాని అర్థంకాలేదు. అసలు జరిగిన సంగతి ఇది; దొంగాడు సూరమ్మను తడుముతున్నాడుట. అదిలేచి కేకలు పెట్టిందట. దొంగాడు అమాంతంగా నేనున్న గదిలోకి వచ్చాడట.

ఆ మర్నాడు సుబ్బారావు చాలా చీకటితోటే లేచాడు. ఎప్పుడూ ఏదో వాగుతూ కూర్చుండేవాడు మౌనంగా వుండటం నాకు ఆశ్చర్యమైంది. నా ముఖంలోకి చూట్టానికే జంకుతున్నాడు, ఏదో అర్జంటుపను వుందని చెప్పి ఇంకా వుంటానన్న వాడల్లా వెంటనే వెళ్ళిపోయాడు.

వాణ్ణి వెళ్ళనిచ్చింది; ఇక ప్రారంభించింది శ్రీమతి "ఆ చాకలి చిన్నదే కావాల్సి వచ్చిందా?"

ఆ పదప్రయోగం నాకు అర్థంకాలేదు. "ఏమిటి? ఎవర్ని అంటున్నావు?" అన్నట్టు చూశాను ఆమెవంక.

"అవునులెండి మీకెలా అర్థమవుతుంది" అంటూ శ్రీమతి ఆడవాళ్ళ అస్త్రం వదిలింది కన్నీటితో మంత్రించి. నాకు నెత్తిన పిడుగుపడ్డంత పనయింది. అది నేనుకాదని, సుబ్బారావని శ్రీమతిని ఒప్పించేసరికి నా తలప్రాణం తోక్కి వచ్చింది.

"దొంగా లేదుపాడూ లేదు, అంతా ఆఫీసరుపనే; పడుచు పిళ్లాన్ని ఇంట్లో పెట్టుకుని అతనికిదేంపాడుబుద్ధి" అంటూ ఆవీధిలో ఈవిషయం కొండంత ప్రచారమయిపోయింది. సంఘంలో నలుగురి జేబులమీదా ఆధారపడ్డవృత్తినాది. పెద్దమనిషి అనిపించుకొంటే కాని నాలుగు డబ్బులు రాలవు. అటువంటప్పుడు నాకీ నింద ఎంతప్రమాదమో ఆలోచించండి—అంతే! అప్పటికీ ఇప్పటికీ నా ప్రాక్టీసు అలాగే వుంది.

కానీ, నాకు ఆశ్చర్యం కలిగించిందేమంటే, ఒకసారి శ్రీమతి లోపల వంటచేసుకొంటూండగా సూరమ్మ వచ్చింది. "ఆవాళ మీ రనుకో లేదండి, ఆ ముట్టమాయన అనుకొన్నాను" అంది. నేనయితే ఇబ్బందిలేనప్పుడు ఆ పతివ్రతకి సుబ్బారావయితేమాత్రం ఏం ఇబ్బందో నాకు ఇంతవరకూ అర్థం కాలేదు.

అటు సుబ్బారావు నిక్షేపంగా వున్నాడు, ఇటు సూరమ్మ నలుగురిలో నూ పతివ్రత అనిపించుకొంది. మధ్య నేనుమాత్రం వీధిపాలయ్యాను. ఇటువంటి నీతిమంతులు వున్నంతకాలం అమాయకులు అపవాదులకు పాలవటం తప్పదు!

---

# రాజులెందరు మారినా—

'అమ్మయ్య! స్వరాజ్యంవచ్చేసింది, ఇక మన కష్టాలు గట్టెక్కాయన్నమాటే. మీరయినా సుఖపడండి, అంతా దేవుడిదయ" అంటూ కన్ను మూశాడు రంగడి తండ్రి— ఆరువందల ఋణం, ఎకరం, పొలం, 'మునసబుధర్మమా' అని ఆయన స్థలంలో వేసుకొన్న గుడిశె రంగడికివదిలి. సంవత్సరం వెళ్ళింది.

"ఋణం తీరాక కాని పెళ్ళిచేసుకోకూడదు" అనుకొన్న రంగడు అభిప్రాయం మార్చుకున్నాడు తల్లి బలవంతంమీద. ఋణం వెయ్యికి పెరిగింది. రంగడికి పద్ధెనిమిదోఏట పెళ్ళింది.

సీతను ఎంచుకున్నారు వాళ్ళవాళ్ళు. అక్షరజ్ఞానం లేని రంగడు దాంపత్యంలో అందచందాలతో అవసరం వుంటుందో వుండదో తేల్చుకోలేదు.

ప్రేమంటే ఏమిటో రంగడికి తెలియదు. కాని భార్యను ప్రేమించకపోలేదు. అదేప్రేమని, ఎందరు కవులు వర్ణించినా దాన్నేనని అతనికి తెలియదు.

అతను డబ్బున్నవాడు కాదు తీసి కూర్చుని ఆలోచించటానికి. దిట్టంగా డబ్బుండీ, పనీపాటాలేనివాళ్ళకు ప్రేమ జీవితావసరపు వస్తువు. రెక్కాడితే డొక్కాడేవాళ్ళకు ప్రేమ జీవితావసరపువస్తువు కాదు. అధవాఅయినా అంతంతమాత్రమే! సీత కాపరానికి వచ్చేసరికి రంగడికి ఇరవై యేళ్ళు.

వున్నయకరానికి సాయం మరో రెండెకరాలు కౌలుకు చేయటం ప్రారంభించాడు రంగడు. మధుర స్వప్నాలుకంటూ

భవిష్యత్తుకి బంగారు రంగరించి పూతపూశాడు. తనకి పిల్లలు పుడతారని 'ఎంచక్కా' వాళ్ళకి చదువు చెప్పించి పెద్దవాళ్ళను చెయ్యాలని, వాళ్లు తనలా కష్టపడి పొట్ట పోషించుకోనక్కర లేకుండా ఉద్యోగాలుచేసి సంపాదించుకోవాలని కలలు కనే వాడు రంగడు.

మూడేళ్లు గడిచాయి.

ఇద్దరుపిల్లలు కలిగారు రంగడికి. అత్తనుకూడా రంగడే పోషించాల్సివచ్చింది. అక్కడికి రంగడికి కుటుంబసంఖ్య ఆరో అంకెమీదికి చేరింది. ఎంత కొట్టుకున్నా సంసారం వెళ్ళటమే గగనమయిపోయేది; ఇక ఋణం ఎలా తీర్చగలడు?

కానీఅయినా వసూలు పెట్టపోతే ఋణం ఏమవుతుంది? రెట్టింపయి కూర్చుంది నాలుగేళ్ళగా కానీ అడగని శేషయ్య-కనిపించినప్పుడల్లా కదలేయటం ప్రారంభించాడు.

ఆఖరికి ఒకరోజున నిలబెట్టి అడిగాడు శేషయ్య. ఆరు నెలలు గడువిచ్చానన్నాడు. ఆతరువాత కోర్టుకి వెళ్ళాల్సి వస్తుందని బెదిరించాడు.

రంగడు ఆలోచించాడు. ఆరునెలల తర్వాత మాత్రం అంతడబ్బు ఎలా వస్తుంది? ఆరునెలలు కాదు, ఆరుదశాబ్దాలయినా అంతడబ్బు కళ్ళచూడటం అసంభవమనుకున్నాడు, అయితే మరి మార్గం? ఒంటే ఒకదారి కనిపించింది అతనికి-పొలంకాస్తా అమ్మేసి ఋణవిముక్తుడు కావటం.

తాతముత్తాతలనుంచీ వస్తున్న ఆ పొలం అమ్మటానికి రంగడి తల్లి ఇష్టపడలేదు. కాని మరో మార్గందొరకలేదామెకు.

రంగడు ఎకరంపొలం బేరంపెట్టాడు.

తనఖాపొలం ఎవరూ కొనటానికి ముందుకురా లేదు.

ఆఖరికి శేషయ్యే కొనమన్నాడు. "అబ్బే! నా కెందుకురా నీపొలం" అంటూనే "అప్పుకి సరిపెట్టుకో" అన్నాడు శేషయ్య. రంగడితల్లి మొగపెట్టుకొంటే ఓ వంద రూపాయిలిచ్చి ఎకరం వ్రాయించుకున్నాడు శేషయ్య.

స్వంతం హరించిపోయాక సంచంపట్టాడు రంగడు. కాని ఏంచేయగలడు? గుండె రాయిచేసుకొని కౌలుకు పొలం చేస్తూ కాపురం గడుపుతున్నాడు

వున్నట్టుండి వుప్పెనలా బయలుదేరిందో 'పుకారు.' కౌలుదారీచట్టం వస్తోందని ఎవరుచేస్తున్న పొలాలు వాళ్ళ కయిపోతాయని, గోరంతలు కొండలుగా ప్రచారం అయిపోయాయి.

ఈ గాలికబుర్లకి జడవలేదు చాలామంది. కానీ, అన్యాయంగా ఆర్జించిన ఆస్తేమో కనకయ్యమాత్రం జడుసుకున్నాడు; ఎక్కడ కౌలుదార్లు ఎగేసుకుపోతారో అని. పంచించలేకపోయినా భూమి తనకింకవుంటే చాలనుకున్నాడు.

ఈ హడావిడిలో రంగడు కౌలుకు పొలం చేసుకునే ఆస్కారం కాస్తా పోయింది. కనకయ్య రంగడిని ఆ ఏటితో తప్పుకొమన్నాడు.

నారోసినవాడు నీరోయకపోతాడా? రంగడు శేషయ్య దగ్గర పాలేరుగా చేరాడు.

అంతర్జాతీయ సూత్రం ప్రకారం దరిద్రుడికీ సంతానానికీ దూరంవుండదు. సీత మళ్ళా నీళ్ళుపోసుకుంది. ముసలి తల్లి మంచానపడింది... సరైనమందు మాకులులేక ముసలిది

రోగిష్టి మంచంలో నేవుంది. తినడానికి సరిపడ్డ తిండిలేక ఏడుస్తుంటే మందులేమిటి ?... ధర్మాసుపత్రిలో రంగుళ్ళకు రోగాలు పోతాయా ? పోవు అని నిరూపించింది రంగడితల్లి.

తల్లి మరణానికి రంగడు విచారించలేదు. తిండిలేక మాడటంకంటే చావటం మంచిదే అయిందనుకున్నాడు.

♦ ♦ ♦ ♦

రంగడి పాలిట శనిదేవతలా పంచాయతీబోర్డు ఎన్నికలు వచ్చాయి. శేషయ్య ప్రెశిడెంటుగిరీకి పోటీచేశాడు. అతనికి పోటీగా మరో ఎల్లయ్య నిలబడ్డాడు. ఇద్దరూ బాగా వున్న వాళ్ళే. అందుచేతనే ఎవరు నెగ్గేదీ ఎవరూ తేల్చిచెప్పలేక పోయారు ఇరుపక్షాల ప్రచారంమాత్రం అద్వితీయంగా సాగుతోంది.

తెల్లవార్తే పోలింగ్. మరోసారి చెబితే ఎందుకైనా మంచిదనుకున్నాడు శేషయ్య. ఓటు తనకే వెయ్యమని మరీ మరీ చెప్పి పంపాడు రంగడ్ని ఆ రాత్రి. శేషయ్య ఓట్లు కొన్నట్లు విన్నాడు రంగడు. తనకూ ఏమయినా పదో పరకో యిస్తాడేమో అని ఆశపడ్డాడు. శేషయ్య అలాంటి దేం చెయ్యలేదు. "నా పాలేరు నాకు వెయ్యడా? " అన్న ధీమాతో పది రూపాయలుకూడ పెట్టాడు.

రంగడు గుడిశెకి వెళ్ళేటప్పటికి ఎల్లయ్యపార్టీ వాళ్ళువచ్చి కూర్చున్నారు. చేతిలో పదిరూపాయల నోటుపెట్టి ఎల్లయ్యకు వోటెయ్యమన్నారు. రంగడు సందిగ్ధంగా వూరుకున్నాడు. రంగడి మౌనంచూసి సీత పదీపుచ్చుకొని వోటే యిస్తానని మాటిచ్చింది.

"ఎందుకుచ్చు కొన్నావే?" అరిచాడు రంగడు.

"బాగుంది వరస సంపాదించేది లేను, కానీ-" సాగ దీసింది.

"ఆరికాడ పాలేరుతనం సేత్తా ఆరికెయ్యాక మరి ఎవరి కేత్తాం?"

"చేసేవులే మాలావు పాలేరుతనం —అయినా మొగానికి సిగ్గుండఅక్కర్లే, అయిన ఎకరం అన్నా యింగా ఏను కున్నోడికి ఎత్తానంటావేం వోటు, ఇంకా ఇలా బీదల్లోపాలాలు ఏనుకోటానికా."

తాతముత్తాతల నుంచీ వస్తున్న పొలం కాజేసినందుకు రంగడు కసితీర్చుకోవటానికి కదేమంచి సమయం అనుకున్నాడు. అంతకంటె ఏంచేయగలడు కనుక? అయినా, ఎవరికేస్తే మంచిదో, అసలు వోటు విలువ ఏమిటో అతనికి తెలుసు కనుకనా?

మర్నాడు ఎన్నికలు జరిగాయి... శేషయ్య ఓడిపోయాడు. అయిదు వోట్లు మెజారిటీతో ఎల్లయ్య ప్రెశిడెంట్ అయ్యాడు.

చిందులు తొక్కాడు శేషయ్య సివ్వాలు తొక్కినసి కోతిలా. ఎల్లయ్య పార్టీవాళ్లు రంగడి గుడిసెకు వెళ్ళటం చూసిన ఎదురింటి ఏసోబు శేషయ్యతో ఆ విషయంకాస్తా విన్నవించుకొని, వ్రూడ్పుల రోజుల్లో సీత చెంగులాగి చెంపపగిలేలాతిన్న కసి తీర్చుకున్నాడు.

శేషయ్య రంగడ్ని పిలిపించాడు. రంగడు నిజం చెప్పలేదు. అయిదు వేలు ఖర్చుపెట్టి వోడిన శేషయ్య తన

పాలేరు తనకు ఓటు వెయ్యలేదనేసరి మండి పడ్డాడు. ఏసోబు మాటలు వేదాంతరాల్లా నమ్మాడు, రంగడి పనిపోయింది. రంగడు జరిగిందంతా ఎల్లయ్యతో మొర పెట్టుకున్నాడు.

ఎల్లయ్య సానుభూతి చూపలేదు. "అలాగా" అని ఊరుకున్నాడు.

"నావోటు మీకే వేశానండి, అందుకేనా పనిపోయింది మీదగ్గర పెట్టుకోండి" అన్నాడు రంగడు.

"ఇప్పుడేం ఖాళీలు లేవురా, అయినా ఊరికే వేసేవేరా, పదిపుచ్చుకొన్నావేమో పడేశావు, సరిపోయింది వెళ్లు" అన్నాడు ఎల్లయ్య

పళ్లుకొరుకుతూ, సీతను తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు రంగడు.

"ఆయూం లో ఏయ్యమన్నావు, ఈయూంల పనిపోయింది ఇక ఏడు."

"ఎల్లయ్యతో చెప్పలేక పోయావా ఆయనిచ్చేవోడు పని."

"ఆఁ! ఇత్తాం - పదిచ్చేవుగా సరిపోయింది ఎల్లన్నాడు'

"ఆరి ఈడిజిమ్మడియ్య ఎంతపని చేసాడు"

♦ ♦ ♦ ♦ ♦ ♦

"బాబూ సైకిల్ రిక్షా"

....................

"సైకిల్ రిక్షాండి"

"నువ్వేం తొక్కగలవురాపో"

"ఆడిగాడ్డీ ఎక్కకండి బాబు నాగనేక ఏ వంతెన